


సుందరి

చిత్రకారుడు: ఎ. బాలకృష్ణారావు

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

సంపుటము 48
సంచిక 28
16-3-55

# సచిత్రవారపత్రిక

Founder · K. NAGESWARA RAO

జయ ఫాల్గుణ బహుళ సప్తమి బుధవారం

## ఎడారి తరువులు

వాల్ట్ డిస్నీ చిత్రం "లివింగ్ డిజర్ట్" నుండి. మరికొన్ని ఫొటోలు, వివరణం 36, 37, 39 పేజీలలో చూడండి. (ఆర్. కె. ఓ. రేడియో వారి సౌజన్యంతో)



## కాంబోడియా కబుర్లు: 4



# ఉగాది



కాంబోడియా వాళ్ళకికూడా మనకిలాగే అరవై సంవత్సరాలూ ఉన్నాయని వెనకటి వ్యాసంలో వ్రాసేను. ఈ అరవై సంవత్సరాలకీ, అయిదేసి సంవత్సరాలకి ఒకటి చొప్పున, పన్నెండు జంతువుల అధిపతులు: మొదటి అయిదు సంవత్సరాలకీ మూషకం, రెండో వర్షపంచానికి వృషభం; మూడోదానికి వ్యాఘ్రం, నాలుగోదానికి చెవులపిల్లి; అయిదోదానికి డ్రేగన్; ఆరు సర్పం, ఏడు అశ్వం, ఎనిమిది ఆడమేక, తొమ్మిది కోతి, పది కోడి, పదకొండు శునకం, పన్నెండు వరాహంన్నూ, చాంద్రమాన ప్రకారం లెక్కించి పై పన్నెండు జంతువుల వృత్తానికి నప్పిస్తారు ఇది ఒక రకం లెఖ్ఖ ఇంక రెండో తరహా, సూర్యమానం ప్రకారం లెఖ్ఖిస్తారు సౌరమానపు లెఖ్ఖలు మామూలు నిత్య కృత్య వ్యవహారాలకీ, చాంద్రమానం మతసంబంధం అయినవాటికిన్నీ యేర్పాటు. చాంద్రమానపు లెఖ్ఖ చైత్రమాసారంభంతో జరుగుతుంది రాజ జ్యోతిషులు లెఖ్ఖలుకట్టి "ఉగాది" ఫలానా నుంచీ మూడురోజులు అని నిర్ణయిసారు. ఒక్కొక్కప్పుడు యీపండుగ నాలుగురోజులుకూడా జరుపుతారు

ఇందులో ముఖ్యమైనఘట్టం "ఇసక కొండల" స్థాపనా, పూజాన్నూ ఈకొండల "*పిచికగూళ్ళ"లాగకడతారు, చైత్రమాసారంభంతో ప్రారంభం అయి, మాసం పొడుగునా వీటికి పూజలూ పునస్కారమూ జరుగుతూ ఉంటాయి వీరు చెప్పే గాథల్నిబట్టిచూస్తే, యీ యిసకకొండల పూజా అదీ హిందూసంప్రదాయానికి చెంది నట్టు కనిపిస్తుంది ఎంచేత అంటే యీ యిసక కొండలు భారతదేశంలో ఉన్న మహాపర్వతపంక్తులనీ[1], వాటిమధ్యఅన్నిటి కన్న యెత్తుగాఉన్నది మేరూపర్వతం అనీ అంటారు. ఇంకొన్ని గాథల్నిబట్టి చూస్తే యీపెద్దకొండ ఒక అతిప్రాచీన స్తూపం అనీ అందులో సిద్ధార్థుడు రాజప్రాసాదం, వైభవజీవితం త్యజించినప్పుడు కత్తిరించివేసినజుట్టు పదిలపరిచిన "ప్రాహ్మస్తూపం" ప్రత్యామ్నాయం అనీ అంటారు. ఈకొండలలో ఉన్న ఒక్కొక్క యిసక రేణవూ ఒక్కొక్క పాపం పరిహారం చేస్తుందిట! అంచేత ఆచారపరులందరూ భక్తిపూర్వకంగా యథాశక్తి యివి నిర్మించాలి ఈ మోస్తరుగా అనేక నమ్మకాలు.

కొన్ని స్థలాల్లో యీ యిసకకొండలు మర్రిచెట్టుకి ప్రత్యామ్నా నిర్మిస్తారు. మర్రిచెట్టుక్రిందనే బుద్ధుడికి "జ్ఞానం" లభించింది కనక యిది ఎంతో పూజనీయం అయిన వృక్షం వీళ్ళకి.

* * *

## క్రొవ్విడి లక్ష్మన్న

సాధారణంగా మర్నాడు పండుగ అనగా తొలినాటి మధ్యాహ్నంకడతారు యీయిసకకొండలు. అలా కట్టలేనివాళ్లు ఎవరైనా కడుతూన్నచోటికివెళ్లి ఓరెండు పిడికిళ్ళ యిసక వేసినా, ఫలితం దక్కుతుంది. ఇహ మర్నాడు ఉదయాన్నే బుద్ధభిక్షువులకి తండులదానంచేసి, యీ యిసక కొండలచుట్టు ముమ్మారు ప్రదక్షిణం చేస్తారు. బ్రాహ్మలు మంత్రాలుచదివి "శుభం భూయాత్. సకలైశ్వర్యాయురారోగ్యాభి వృద్ధిరస్తు" అని దీవిస్తారు. కాగితంతోచేసిన మర్రిచెట్లూ, ఊదొత్తులూ అవీ యీ కొండలముందుపెట్టి, పసుపు నీళ్లు ప్రోక్షించి నమస్కరిస్తారు. ఈ యిసకకొండలు యిసకతోనే చెయ్యాలన్న నిర్బంధంలేదు కొన్నిచోట్ల ధాన్యంతోనూ, అన్నంతోనూ, బియ్యంతోనూ, కేకులతోనూ (Cakes) కూడా చేస్తారు.

ఉగాదికి కొద్దిరోజులు ముందుగా నాంపెన్‌లో కాంబోడియాప్రభువు, సిల్వర్ కొండమీదఉన్న పేగోడాలో యీ "యిసకకొండల పూజ" జరుపుతాడు. అక్కడ ఒక ప్రాచీనస్తూపంకూడావుంది. ఇదికాక, యిలాగే కోట ఆవరణలోవున్న "సిల్వర్ పెగోడా"లోకూడా రాజుగారు, యిసక కొండలుపెట్టి, ముమ్మారు ప్రదక్షిణం చేస్తారు. లాంక్వెక్ క్షేత్రంనుంచి తెచ్చిన యిసక ఓ గుప్పెడు స్వహస్తాలతో ఉంచి, దానికి పువ్వులూ అదీ పూజచేస్తాడు ఆతరవాత రాజకుటుంబం, కొలువుకూటంలో ఉన్నతోద్యోగులూ కూడా ఆవిధంగానే పూజచేస్తారు. కాని వీళ్లు లాంక్వెక్ క్షేత్రంనుంచి తెచ్చినయిసక ముట్టుకో వీలులేదు. అంచేత మెంకాంగ్ నదీతీరం నుంచి తెచ్చిన ఎర్రటి యిసక జల్లుతారు. బుద్ధభిక్షువుల ప్రవచన ఘోషతోనూ, వారికి అంగవస్త్ర దానంతోనూ తంతు పూర్తవుతుంది.

మనలాగే వీళ్ళకీ మకరసంక్రమణం, కటకసంక్రమణం రెండూ తెలుసు. సంక్రాంతి సందర్భంలోనే ఓ చిత్రం అయిన గాథ చెబుతారు పూర్వం ఒకప్పుడు కపిలమహర్షి (1*Kabel Moha Prohm*=కపిల మహాబ్రాహ్మడు!), 2ధర్మపాలుణ్ణిమూడు 3ప్రశ్నలడిగేట్టు. వీటికి గనక ధర్మపాలుడు

---

*తడియిసకలో పిల్లలుకట్టే "పిచిక గూళ్ళు".

[1] వీటికవతల పెద్దదేవుడిపీఠం ఒకటిపెట్టి యముణ్ణి ఆరాధిస్తారు. మనలోలాగే వీళ్లకీ యముడు నరకానికి అధిపతి.

1. *Kapila le Grand Brahmana*

2 *Thomobal* = ధర్మపాలుడు, న్యాయవేత్త.

3 యక్షప్రశ్నల్లాంటివి.

### విషయానుక్రమణిక

ముఖచిత్రం:—
హిందీ నటి అనితా గుహ.

 ఉగాది 

సరిఅయిన జవాబులు చెప్పేడా, కపిలుడు తనతల యిచ్చేస్తానన్నాడు; లేదూ, ధర్మపాలుడి తల యెగిరిపోతుంది ఇదీఒప్పన్నం. అయితే గడువు తేదీలోగా ధర్మపాలుడికి మంచి ఛాన్సు ఒకటి దొరికింది. రెండు గరుడపక్షులు యీసమస్యతే అనుకోవడం చర్చించడం విన్నాడు ధర్మపాలుడు; సమాధానాలు చెయ్య చిక్కించుకున్నాడు. న్యాయం చేసుకున్న రోజున అది కాస్తా చెప్పేసరికి, కపిలుడు తన తల కొట్టేసుకోవలసివచ్చింది. కాని కపిలుడు ఓ అసాధ్యఘటం అతని తలగానీ భూతలం తాకిందా యావత్ భూమండలమ్మూ భగభగ మండిపోతుంది; ఆకాశంలోకి గానీ విసిరేసారా యిహమరి వానలు సున్నా; పోనీఅని సముద్రంలో పారేస్తే, ఒక్కబొట్టయినా ఉండకుండా సముద్రంలోనీళ్లు ఆర్చుకుపోతాయి. ఇలాంటి హిరణ్యాక్షవరాలు పొందిన బుర్ర కపిలుడిది. అంచేత తన ఏడుగురు కుమార్తెలని పిలిచి, తల నరికీ నరకడంలో మరెక్కడా పడకుండా ఓ వెండిపళ్లెంలో "పండుపట్టు" కోమని ఆదేశించాడు. ఆప్రకారం పెద్దకూతురు "తుంగ్యా" టపీమని పళ్లెంలో అందుకొంది. అప్పట్నుంచే ఆకూతుళ్లు తల కొక్కరూ వాళ్ళవాళ్ల వొంతు ప్రకారం ఓబంగారపళ్లెంలో ఆతల ఉంచి, మేరూపర్వతంచుట్టూ (60అనటి"ల"కాలం అంటే పూర్తిగా ఒకరోజు) ప్రదక్షిణంచేస్తారు. వారంలో ఏరోజున సంక్రాంతి పడుతుందో ఆప్రకారం యీ యేడుగురు కూతుళ్ళలోనూ వొంతువొచ్చిన పిల్ల యీ తల బంగారపళ్లెంలో పెట్టుకుని, దేవదేవతలు వెంటరాగా, మేరూపర్వతంచుట్టూ ప్రదక్షిణం చేస్తుంది. మాటవరసకి, సంక్రాంతిగానీ ఆదివారంపడితే తుంగ్యా యీదేవ దేవతా గణాన్ని వెంటవేసుకుని ప్రదక్షిణం చేస్తుందన్నమాట.

ఇంతేనామరి? ఈ పిల్లలు దేవదేవతా గణంతో చేసిన పర్యటన వల్ల ఏటి ఏడాది పొడుగునా కొన్ని ఫలితాలు సంఘటిస్తాయి. ఆయాఫలితాలు—మంచీ,చెడ్డా,—పంచాంగంలో రాసి ఉంటాయి (మన సంక్రాంతి పురుషుడిలక్షణాలూ, ఫలితాల్లాగ). అంచేత సంక్రాంతినాడు రాజుగారు శంఖాలూ వాటితో కొలువుకూటంలో తమ సింహాసనానికి ఎదరగా ఉన్న దేవుడి పీఠందగ్గరకివొచ్చి, భూదేవతలకీ, రాజ్యాధి దేవతలకీ నమస్కరించి ప్రార్థనచేస్తాడు. జ్యోతిశ్శాస్త్రవేత్తలూ వాళ్లూ, ప్రభువూ కోటా, ప్రజలూఅంతా ఆయురారోగ్యాలతో వర్ధిల్లాలనీ, దేశం సుభిక్షంగా ఉండాలనీ, క్షేమకరంగా వర్ధిల్లాలనీ మంత్రాలు జపిస్తారు పాళీ భాషలో. ఆతరవాత రాజుగారు తిరిగీ నమస్కరిస్తారు. ముమ్మారు శంఖాలు పూరిస్తారు. అసలు కోటలోజరిగే ఏకార్యమ్మూ కూడా ముమ్మారు శంఖాలు పూరిస్తేనే గాని పూర్తిగాదు. చివరన మంగళవాయిద్యాలు మోగుతాయి.

ఆరోజునే రాజుగారు లాంఛనంగా శాస్త్రప్రకారం స్నానకర్మ ఆచరిస్తారు. ఎన్నిగంటలకి స్నానంచెయ్యాలో హోరాశాస్త్రప్రకారం నిర్ణయిస్తారు, పురోహితులు. బుద్ధభిక్షువులు ఆశీర్వాద మంత్రాలు చదువుతూఉంటే, ఓ యిత్తడి గంగాళం నిండా నీళ్లునింపి కుదుటిమీద నిలబెడతారు. దానిముందు, తెల్లనిబట్ట కట్టుకుని రాజుగారు శుభదిశగా తిరిగి కూర్చుంటారు. ఈశుభదిశ ఆయుష్షుకి మంచిది ఆది, సోమ యిలాగ్గా వారాన్ని బట్టి యీదిశరోజురోజుకీ మారుతూఉంటుంది. దీనికి పెడదిశ అశుభం; మారకదిశన్నా. ఈరెండూ యెప్పుడూ ఎడాపెడాగా ఉంటాయి. రాజపురోహితుడు గంగాళంలో నీళ్లుతీసి రాజుగారిమీదజల్లి స్నానం చేయిస్తాడు. తరవాత ఓశంఖంతో పోసి కొంచెం తీర్థంయిస్తాడు. (యిక్కడ కూడా శంఖంతో పోస్తేనేగాని తీర్థం కాదు!) ఈతీర్థం రాజుగారు ముఖంమీదా, శిరస్సుమీదా జల్లుకోవాలి ఇంతసేపూ "బకు"లు (బ్రాహ్మలు) మంత్రాలు చదువుతూనే ఉంటారు.

ఆవేళ రాజుగారు పంచక్షేత్ర విగ్రహాలనీ పన్నీటితో * ప్రోక్షిస్తారు. ఆవిగ్రహా పంచకం ఏమిటీఅంటే—శివుడు, నారాయణమూర్తి, బలదేవుడు, గణేశుడు; ఉమాదేవిన్నీ. ఉగాది మూడురోజుల్లోకీ ఆఖరురోజున రాజుగారు తమకోటలో ఉన్న బుద్ధవిగ్రహాన్ని కూడా పన్నీటితో ప్రోక్షించి, రాచకుటుంబంలో అతః పూర్వం కాలధర్మంపొందినవాళ్ల ఆత్మశాంతికి జరిపే బుద్ధసన్యాసుల స్నానాదికాలు చిత్తగిస్తారు

ఆనాడే రాకుమారులూ, కుమార్తెలూ, మంత్రులూ, సామంతులూ తదితర భృత్యులూ అంతా పువ్వులూ పరిమళ సామగ్రీ, ఊదొత్తులూ అవీ సమర్పించి రాజుగారికి ఆయురారోగ్యాలు కలగాలని ప్రార్థిస్తారు

ఆతరవాత యుద్ధరంగంలో మగ చతురంగబలం తీర్చినట్టుస్తూ ఉంటే మన పురోహితులు పవిత్రజలాలు జల్లుతారు. దాని తరవాత ఏనుగులూ, గుర్రాలూ వెళ్లగా కుస్తీపట్లూ వగైరా వినోదకాలక్షేపం జరుగుతుంది *

ఊరంతటా మధ్యాహ్నంపూట వినోదకాలక్షేపాలూ, ఆటలున్నూ. ఆడామొగా కలిసి "చంగ్"ఆడతారు. ఓ పక్క అంతా ఆడవాళ్లూ, యింకోవైపంతా మొగాళ్లున్నూ — మఫ్లరు ఉండగా చుట్టి ఎగరేసూ, గెంతుతూ,—ఆడుతూపాడుతూ కాలక్షేపం చేస్తారు.

సియమ్‌రెయప్, బట్టమ్‌బంగ్, పుర్సాత ప్రాంతాలలో యీపండుగరోజుల్లో పాటలు పాడుకుంటూ ఉదయాన్నే యింటింటికీవెళి, మనవైపు పండుగరోజుల్లో బియ్యందండినట్టు, దండుతారు. ఇందులో పగటివేషగాళ్లు కూడాను. ఒకొంకికర్రకి ఓకోనని దుప్పిబుర్రా కొమ్ములూ తగిలించి, రెండోకొనని (తోకవేపు) గడ్డికుచ్చుకట్టి దానిలో ఓగంట వేలాడదీస్తారు. ఈకర్రమీద ఒకడు నుంచుని దుప్పిలాగ అటూ ఇటూ ఎగురతూఉంటే, రెండోవాడు తన కర్రతుపాకీతో దీన్ని వేటాడతాడు.

కందాల్ రాష్ట్రంలో స్త్రీలు యీరోజుల్లో పెగోడాల్లో మీకాంగ్ నదిని అనుకరిస్తూ ఓచిన్న నదిలా చేసి, అందులో చిన్నచిన్న అట్టపడవలు వొదులుతారు మీకాంగ్ నదిలో మొసళ్లు విపరీతం. ఇలాచేస్తే మొసళ్ళబాధతప్పుతుందని ఓనమ్మకం!

* నేటిరోజుల్లో యీ ఆనవాయితు బాపతు మిగిలిందల్లా, రాజుగారి కొలువుకూటానికి ఎదరగా జరిగే కుస్తీపట్లు మాత్రమే కోట అవతల యింకా రకరకాల వినోదాలు జరుగుతాయి.

(యింకా ఉంది)

* *d'ean parfume'e*

# అయింది, అబ్బాయిగారి పెళ్ళి!

**అవసరాల రామకృష్ణారావు**

*

అప్పుడే సినిమా విడిచిపెట్టేరు. వచ్చేస్తుంటే శర్మ కనిపించాడు.

‘ఏం భాయీ, చిన్నతనంలోనే పుణ్యకార్యాలకి పూనుకున్నావు. ఈమధ్య మళ్ళీ నీ చలవవల్ల మన ఎరికని ఎక్కడైనా సంబంధాలు జతపడ్డాయా?’ అన్నాను నేను. శర్మ చురచుర చూస్తూ గబగబ నడిచి వెళ్ళిపోయాడు. అబ్బో అదంతో బోలెడంత కథ!

*　　*　　*

మా క్లాసుమేట్ సుశీల అందమైనదే, ఒప్పుకుంటాను. కాని - పద్దెనిమిదేళ్ళు పైబడినా పరికిణీవాణీ వేసుకోడం, జడ సరిగ్గా భుజందగ్గిర అల్లిక మొదలెట్టి రెండేరెండు అల్లికలు అల్లి ఆ పాయల్ని అలా గాలికి వదిలెయ్యడం, పృథివిలో పువ్వులే కరువైనట్టు రెండు చుక్క చుక్కల క్రోటన్సు ఆకులు ఆ తలకట్టులో గుచ్చుకోడం, వచ్చినా చెమటపట్టని చలికాలంలో సహా నడుముకి కుడిచేతివైపున తెల్లని రుమాలు మడత నలుగురికీ కనపడేచోటున దోపుకోవడం, కంగారు పిల్లని కన్నతల్లయినా వదులుతుందేమో గాని అందులో దమ్మిడీ లేకపోయినా ఎల్లప్పుడూ హేండ్ బ్యాగ్ ధరిస్తూఉండడం – సుశీల అలంకారాలని భావించవచ్చును గాని అలవికారాలని నా నమ్మకం. ఎందుకో తెలియకుండా మాట్లాడితే నవ్వడం, ఎత్తెత్తి అడుగులు వెయ్యడం, ఎంతటివారినయినా ఎకసక్కెం చెయ్యడం సుశీలకు సుగుణాలుగా కనిపించవచ్చు గాని, అదొక రకం ఆడపిల్లల జబ్బు లక్షణాలుగానే భావిస్తాను అందుకే ఆమె అందమైనదంటే ఒప్పుకుంటాను గాని ఆ అతిశయాన్ని భరించలేను. అయితే సహజ సౌందర్యంగల ఆ సుందరికి యీ లక్షణాలు వీడొక్కడూ వికారాలని వివరించాడు గాని ఆమె చుట్టూ అల్లంత దూరంలో గల్లంతుచేసే కందిరీగలకు అవి అలంకారాలే.

ఇదంతో ఎందుకు గాని, ఒకనాడు ఆ అమ్మాయి కొత్తపేట ఘోషాసుపత్రి సందులోంచి సైకిలు రిక్షాపై వస్తుంటే వెనకనే సైకిలుపై వస్తున్న మా కెమిస్ట్రీ లెక్చరర్ నటరాజన్ పలకరించకుండా ఉండలేకపోయాడు.

‘హల్లో సుశీలా, ఎక్కడ్నుంచీ ఏమిటి కథా?’

“మేటినీకి వెళ్తున్నాను. ‘హౌటు మేరీ ఎ మిలియనీర్’. నాకు సరిగ్గా అర్థం కాలేదు.”

‘సరిగ్గా అర్థం చేసుకుంటే అదే అర్థమౌతుంది’ అని అదోలా చూశాడు నటరాజన్. ఆ చూపులో ‘నేనూ ఒకవిధంగా మిలియనీర్నే. నన్నే పెళ్ళాడకూడదూ? ఇందులో అర్థంకానిదేముంది’ అన్న భావం స్పష్టంగా కనిపిస్తోంది. ఎదురుగా వీస్తున్న యీదురుగాలికి సుశీల ముంగురులూ, దుస్తులూ తమాషాగా ఎగురుతున్నాయి. చుట్టూ ఎవరూ లేరు. నటరాజన్‌కి ఎన్నో సంగతులు చెప్పకోవాలనిపించింది.

‘ఏమిట్రా ఆ తొందరా? రిక్షా కాస్త నెమ్మదిగా పోనియ్. లిక్విడిఫికేషన్ ఆఫ్ ఎయర్ అర్థమయిందా సుశీలా?’ అని ఆరోజు పాఠంగురించి మామూలు ప్రశ్న వేసి ‘ఛస్ యిలాంటి చచ్చు ప్రశ్న వేశానేమిటి?’ అని నిందించుకున్నాడు నటరాజన్. సుశీలకు వాయువును ఎలా ద్రవీభవనం చేస్తారో కొంత అర్థమయింది. కాని ఈ గోమాయువు ఎందు కిలా నీరయిపోతున్నాడో ఓ పట్టాన అర్థంకాలేదు.

‘బాగానే బోధపడిందిసార్! మీరు ఓసారి చెబితే వెంటనే అర్థమయిపోతుంది సార్’. నటరాజన్ కొత్త గోదావరిలా పొంగిపోయాడు. ఇంక ఆలస్యంచేస్తే లాభం లేదు.

‘అంతేనా? అంతవరకేనా అర్థంచేసుకున్నది?’

‘తర్వాత పాఠం చెప్పందే ఎలా బోధపడుతుంది సార్?’ అంది నవ్వుతూ సుశీల. ఆ అమ్మాయికి తెలియనేలేదో, తెలిసే యిలా ఏడిపిస్తోందో నటరాజన్‌కి బోధపడలేదు.

‘పరీక్షలు దగ్గిరకొస్తున్నాయి, బాగా చదువుతున్నావా? క్లాస్ ఎక్స్‌పెక్ట్ చేస్తున్నావా?’

ఇదే ఎవరిదగ్గిరో అయితే సుశీల ఎన్ని గొప్పలు చెప్పుకుని ఉండునో! కాని ఆ అడిగింది తన మెయిన్ సబ్జెక్ట్ కెమిస్ట్రీ లెక్చరర్ అయెను! అందులో ఛీఫ్ ఎగ్జామినరు కూడాను!

‘ఎందుకు మేష్టారూ అర్థంలేని ఆశలూ? ఫిజికల్ కెమిస్ట్రీ నాకు బొత్తిగా పూర్! కంప్లీట్ చేస్తే అంతే చాలు!’

‘అమ్మమ్మ, ఎంతమాటన్నావ్? వడ్డించేవాడు మనవాడైతే కడబంతిని కూర్చుంటేనేం? నేనుండగా నువ్వంత నిరాశపడవలసిన అవసరంలేదు. నీకు క్లాసు వచ్చే పూచీ నాకు వదిలిపెట్టు’ సుశీల మాట్లాడకుండా తలవంచుకు కూర్చుంది. దూరంనుంచి ఎలక్ట్రిక్ లైట్ల వెలుతురు చెట్లచాటునుంచి అప్పుడప్పుడు కనిపిస్తోంది.

‘ఇంకేముంది, మాట్లాడినట్టే లేదూ! అప్పుడే వచ్చేసింది. ఈ ఆసుపత్రి కాంపౌండు గోడ యింకొంచం పొడుగ్గా కట్టించి ఉంటే ఈ మునిసిపాలిటీ వాళ్ళ సొమ్మేంపోయింది?’ అని విసుక్కున్నాడు నటరాజన్. సీరియస్‌గా మొహం పెట్టి అన్నాడు.

‘సుశీ, నీకెలా చెప్పను, అర్థమౌతుందా?’

‘అదేమిటి మేష్టారూ, మీరు చెప్పింది ఏది అర్థమవలేదు గనక? సబ్జెక్ట్ ఎంత డిఫికల్ట్‌గా ఉన్నా యిట్టే అరిటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టు చెప్పేశే వారుగద!’

‘అది నిజమే అనుకో. పెద్దపెద్ద యింగ్లీషు పుస్తకాలు చదివి ఏదో క్లాసులో తంటాలు

తకేవాడినే అనుకో. దాని సంగతి ఎందుకు గాని - ఈ మనస్సు ఉండే దీనిభావాన్ని ఒక్క నోటితోనే వ్యక్తపరచడం కష్టం. ఆ పెదవులు చూడు, కళ్లు చూడు '

'అలాగే చూస్తాను గాని ముందు కంక రాళ్లకుప్ప వుంది. మీరు చూసుకోండి సైకిలు చెట్టెక్కను!'

ఈ మాటకి రిక్షావాడు కూడా నవ్వేడు. నటరాజన్ హేండిల్‌బార్ పక్కకి తిప్పి-మంచి మాటల్లో అడ్డొచ్చిన ఆ రాళ్లకుప్పని తనివితీరా తిట్టుకున్నాడు. సుశీలే అంది,

'అవును పెదవులు ఒణుకుతున్నాయి, కళ్లమ్మట నీరు కారుతోంది!'

'సరిగ్గా అదే.'

'ఈ పక్కది ఆడవాళ్ల హాస్పిటలు అయి పోయింది. లేకపోతే నేనే వచ్చి మిమ్మల్ని స్వయంగా జాయిన్ చేయించి ఉందును. ఏమిటి బాధ?'

'అబ్బో, అదో పెద్దగాథ! ఈ బాధకి చికిత్స హాస్పిటల్సులో జరగదు. నీలాంటి సుందరి హాస్పిటాలిటీ కావాలి ఇంకా నీకు అర్థం కాలేదంటే నేను నమ్మను. ఇంక నీకు చెప్పదలచుకోలేదు నువ్వే నాకు జవాబు చెప్పకోవలసి ఉంది.'

ఆ చతురిక చూపుల్లో యింకా ఏ భావమూ కనపడకపోడం నటరాజన్‌కి ఆశ్చర్యం కలిగించింది.

'అర్థమయింది మేష్టారూ, దీనికి జవాబు రేపు మధ్యాహ్నం సైన్సు హాలులో లీజర్లీగా చెబుతాను.'

'అలాగే చెబుదువు గానిలే. ఒక్క విషయం మాత్రం జ్ఞాపకముంచుకో. బియ్యే క్సీలో ఆర్డినరీగా పాసవడంకంటె విత్‌డ్రా అవడం మంచిది. ఇది వరతూ అనీ, బేరం అని నువ్వు అనుకోవద్దు గాని నే చెప్పిన విషయం వప్పుకుంటే మాత్రం నీకు క్లాసు షూర్! గుడ్ నైట్'

అది చిన్న దారి. సైకిలు రిక్షా, సైకిలూ పేర్లల్‌గా నడుస్తున్నాయి. అవతక అయిదు నిముషాలనుంచీ ఒక సైకిలు వస్తూండడం నటరాజన్ చూడలేదు గాని సుశీల చూసింది. ఏదో విజయం సాధించినట్టు 'లలలాలా లల్లా లలలా' అని పాడుకుంటూ నటరాజన్



**పీత** చిత్రకారుడు : సి. యస్. యన్. పట్నాయక్

(మద్రాసు చిత్రకళావిద్యాలయ విద్యార్థుల ప్రదర్శనంలోని చిత్రం. మరికొన్ని చిత్రాలు 7, 20, 21, 28, 29 పేజీలలో ప్రచురించబడినాయి.

త్వరత్వరగా సైకిలు తొక్కుకుంటూ వెళ్ళిపోయాడు. ఎదురుగుండా 'మోడరన్ కేఫ్' దీపాలు ఒక్కసారి సైకిలు రిక్షా వెనక వస్తున్న రిక్షామీద పడ్డాయి

'ఎవరూ? మిస్టర్ శర్మా?'

ఇదిగో సరిగ్గా యిక్కడే మన కథానాయకుడు శర్మ ప్రవేశం. వాడు మా రూం మేటు కూడాను. అవాళ కొన్న సబ్బు ఆర్రోజులు తిరక్కుండా రెండంగుళాల దళసరిదే లేకు ముక్కైకూరుకుంటే ఇదంతా నీ నా భేదం లేని శర్మ చేతి చలవే అని గ్రహించి నలుగురూ వాణ్ణి సాయం పట్టి పంపగా నాదగ్గర అరణాల అరువు డబ్బులూ, పక్క రూం పార్థసారథి పాత సైకిలూ తీసుకెళ్ళి లైటు లేని కారణంచేత కొత్తపేట ఘోషాసుపత్రి సందులోంచి కృష్ణా ఎంపోరియం వెడదామని సైకిలు తొక్కుతూంటే ఆఖరి అయిదు నిమిషాల్లో అతిదగ్గిర వారినుంచి, అతి ఆశ్చర్యకరంగా అనుకోనే మాటలు అతని చెవుల్లో పడ్డాయి.

ఆ అమ్మాయి రిక్షా ఆపించింది.

'ఏంశారా? ఆ మాట ఒప్పుకుంటే నాకు ఫస్టు క్లాస్ తప్పదుట, బాగుందా?'

'అవునవును—విన్నాను.'

'మీ అవసరం ఏదైనా వస్తే తప్పకుండా సాయం చేస్తారనుకుంటాను ...వస్తాను, వానియ్యరా..'

'లక్షలు విలువజేసే లావణ్య నాతో మాటలాడింది. ఇక యీ ముష్టి అరణాలూ పెట్టి సబ్బు కొంటే నేం కొనకపోతేనేం?' అని మా మిత్రుడు, చేతిలో ఎమిక తప్ప లేనివాడు, నా దగ్గిర బదులుచ్చుకున్న అరణాలూ కాలవపక్క కబోది పక్షికి దానమిచ్చి అరవైమైళ్ళ స్పీడుతో హోస్టలు చేరుకున్నాడు. అప్పుడే నేనూ క్రికెట్ మ్యాచ్ నుంచి రూంకి వచ్చేను వాడు జరిగిందంతా చెప్పేడు. ఏమిటో దీంట్లో అదృష్టం కన్న అరిష్టమే నా కెక్కువగా కనిపించింది.

'ఈ నటరాజన్ యింతటి వాడన్న మాట. సరే అయినా ఏదో చదువుకుందామని పొగురూరి నుంచి యిక్కడికి వచ్చినవాళ్ళం మనకే గొడవెందుకు? రేపొద్దుట నిన్నెవరైనా ఏమైనా అడుగుతే నాకేం తెలీదని చెప్పు. ఎలాంటివాడైనా అతడు మన ఎగ్జామినరు కొంచెం జాగ్రతగా ఉండడం మంచిది, నీ మేలుకోరి చెప్పేను ఆపైని నీ యిష్టం'

శర్మ హఠాత్తుగా ఆదర్శవాది అయిపోయాడు మనుషులిలా ఎందుకు మారిపోతారో తెలీదు

'అయితే అతడు మన ఎగ్జామినరు గదా అని తోటి స్టూడెంట్‌కి అన్యాయం జరుగుతూంటే చూస్తూ ఊరుకోమంటావా? మన కేదో అన్యాయం జరుగుతుందని అబద్ధం



# "అర్ధణా టీ"

చిత్రకారుడు: రాగి వెంకటేశ్వరరావు.

చెప్పి లెక్చరర్ని తెరుకొట్టి మెప్పుపొందమన్నావా? స్పష్టంగా చెవులతో విన్నదాన్ని కాదని చెప్పి ఆత్మవంచన చేసుకోమన్నావా?'

ఇక వీడితో లాభం లేదనుకున్నాను మనుషులు ఎవరికేనా ఏదేనా ఉపకారం చేసినప్పుడు అది నిష్కామంగా చేస్తారో ఫలాపేక్షతో చేస్తారో తెలుసుకున్నాను. ఇదే మొగ విద్యార్థి అయిఉంటే శర్మ యీ ఉపకారం చెయ్యడానికి సాహసించునో సాహసించడో నాకు తెలియదు. అందులో యీ శరణార్థిని ప్రత్యేకించి సుశీలే అయి ఉండడం శర్మ ఆదర్శాన్ని మరింత బలపరచి ఉండవచ్చు

తోటి విద్యార్థినికి యింత అన్యాయం జరగడం శర్మ భరించలేడట. ఆ అన్యాయం చేసింది ఎవరుగానీ, ఎంతటి ఉన్నత పదవిలో ఉండనీ ఖండించి తీరుతాడుట. భగవంతుడికి భక్తులమీదే ఉంది, శర్మకి విద్యార్థినులమీదే ఉంది, అంతటి కరుణ!

'ఇవాళ యిదయింది, రేపు మరోకటవుతుంది. ఇలా అయితే ఆడపిల్లలు కాలేజీకి వచ్చి నిర్భయంగా చదువుకోగలరా?' అని అతి సీరియస్‌గా మాట్లాడ్డం మొదలు పెట్టేడు. శీతాకాలం తెల్లవారు ఝామున రెండెంగుళాల దళసరి రగ్గులు కప్పుకుని వెచ్చగా పడుకునే హాస్టలు విద్యార్థులకి ఆరుగంటలకి టిఫిన్ కని కొట్టే కంచుగంట లేపి కూర్చోపెట్టినట్టు శర్మ ఆదర్శవాక్యాలు కాస్త బద్ధకస్తుల చెవుల్లోకూడా బలవంతాన దూరి కూర్చున్నాయి.

ఈ కథకి ముఖ్య పాత్రలయిన సుశీలా,

# ★ అయింది, అబ్బాయిగారి పెళ్లి ★

నటరాజన్ నిద్రపోయారో లేదో నాకు తెలీదు. హాస్టల్లో మాత్రం ఆరాత్రి ఎవరికీ నిద్దర్లు లేవు!

'తండ్రిలేని పిల్లగదా అని యింత చొరవ తీసుకుంటాడా? ఇలా అయితే రేపొద్దున్న చదువుకున్న ఆడపిల్ల లెవరైనా యీ పరిసరాల కొస్తారా? ఇంత దౌర్జన్యమా?'

నామటుకు నేను రూంలో పడుకుంటే బలవంతాన లేపి కూర్చోబెట్టారు.

'ఇంతింత అక్రమాలు జరుగుతూంటే నీకు నిశ్చింతగా నిద్రెలా పడుతూందోయ్? ఏవో అల్లిబిల్లి కథలు అల్లి పత్రికలకి పంపించడ మనుకున్నావా?'

నా ఒళ్ళు మండిపోయింది.

'ఆ అమ్మాయికి జరిగింది అన్యాయం కాదని ఎవరన్నారు? ఆ అమ్మాయేం నోరులేని పసికూన కాదు. పైగా ప్రిన్సిపాలుకి వరసకి మేనగోడలాయె. మన మందరం యింతలా గింజుకుపోడం దేనికి?'

'అయితే చూస్తూ ఊరుకోమంటావన్న మాట. తీరా మీదకొస్తే ఆ రావణాసురుడు ఏం మార్చి చెబుతాడో! మరో సాక్ష్యముండడం ఎందుకేనా మంచిది కాదూ?'

'మంచిదే, ఆ అదృష్టం నీకే పట్టడం మరీ మంచిదీ!'

'ఒకళ్ళ కేదయినా అదృష్టం కలుగుతే మరొకళ్లు అసూయపడ్డంలో ఆశ్చర్యంలేదు' నేను నిర్ఘాంతపోయాను. అగ్గిపెట్టె మొదలు ఆసుజోడువరకు అరువు ఇచ్చే రూంమేటుని యీనాటికి శర్మకి అసూయపరుడిగా కనిపించానా? ఇంతకీ శర్మకి పట్టిన అదృష్టం మేమిటి గనక? ఈ ప్రశ్నకి సమాధానం పక్కనున్న కృష్ణమూర్తి చెప్పేడు.

'రేపు ప్రిన్సిపాలు నీకు కబురంపించి అసలు సంగతి తెలుసుకోవచ్చు. ఛీఫ్ ఎగ్జామినరు అని అయినా వెనుదియ్యకుండా నిజం చెప్పినందుకు సుశీల నిన్నెంతో కంగ్రాచ్యులేట్ చెయ్యొచ్చు. మాటలు మంచిముత్యాల్లా వాడుకనే ఆ మనోహరి నీకు స్వయంగా పార్టీ యివ్వొచ్చు. అది క్రమంగా స్నేహం, స్నేహం...'

'అబ్బ! యింక చెప్పకోయ్ నాకదోలా ఉందీ!' అన్నాడు శర్మ సిగ్గు అభినయిస్తూ. వరదలో ఉన్న ప్రవాహబలం లాంటది విద్యార్థి బలం. తెల్లవారే సరికల్లా చిన్న చిన్న కాగితాలు అచ్చు వేయించారు 'లెక్చరర్ దౌర్జన్యం' అన్న పేరుతో.

అతికష్టంమీద తెల్లవారింది. అతి నెమ్మదిగా పది గంటలయింది. అతి బ్రహ్మాండంమీద మూడు అవర్సు గడిచి యింటర్వల్ అయింది.

నటరాజన్ శర్మ వాక్యాలతో 'మొహం చెల్లక' ఆనాడు శలవుపెట్టేడు. అయినా దేనికో మరి కాలేజీకి వచ్చాడు. అతని దాకా అచ్చు కాగితం వెళ్లిందో లేదో గాని అందరి మొహాలమీదా అచ్చొత్తినట్టున్న భావాలు మాత్రం స్పష్టంగా చదువుకున్నాడు. అయినా అతని మొహాన్ని ఇంకా చిరునవ్వే వుండడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. శర్మకి ఆశాభంగమే అయింది.

ఫిజిక్సులో 'వేవ్ థీరీ' చెబుతున్నారు. ఉత్తి రోజుల్లోనే మాకు పాఠాలు ఎక్కవు. ఇంత సందిగ్ధసమయంలో ఏమర్థమవుతుందీ? అందులో ప్రిన్సిపాల్నుండి కబురు వచ్చి మొదట సుశీలా, తరవాత అర గంటకి శర్మా వెళ్ళేరు. వెళ్ళినవారు ఎంతకీ రారు ఇంకేం వింటాం పాఠాలూ?

ఇందులో మరోలా జరగడాని కేముంది గనక? నటరాజన్ సస్పెండ్ అవుతాడు. లేదా ఏకంగా డిస్మిస్ అవుతాడు. అతని రోజులు దగ్గిరపడి సుశీలలాంటి అందరాని ఫలాన్ని ఆశించాడు. శర్మలాంటి వాడి చెవిని పడ్డాడు. అతనికీ కాలేజీకీ రుణాను బంధం సరి ఇక మొహం ఎలా చూపిస్తాడు?

ఏమయిందో ఎవరికీ తెలీదు శనివారం నటరాజన్ శలవు ఆదివారం కాలేజీకి శలవు. హాస్టల్లో శర్మ ప్రభావం మాత్రం థర్మామీటరులో పాదరసంలా, నాగుపాం విషంలా చరచర పైకెక్కి కూర్చుంది. ప్రిన్సిపాలు రూంనుంచి రాగానే మాత్రం అతన్నందరూ చుట్టుముట్టేశారు.

—ఏముందీ, ఏం జరిగిందని అడిగేరు. జరిగిందంతా చెప్పేశాను.

—అంతా పెద్ద ఏముందీ? నువ్వు విన్నది నాలుగు ముక్కలేగా!

—చెప్పాలంటే ఎంతయినా ఉంది. 'వారి జాతులందు...' అన్నారు. అబలా రక్షణలో అబద్ధప్రయోగం చేసినా తప్పులేదన్నారు, శుక్రాచారి'

—వెరిగుడ్, నిన్న మనమనుకున్నదంతా చెప్పేశావా?'

—ఆహా అక్షరాలా.

నిన్న వాళ్లు అనుకున్నదేమిటో మరొక విద్యార్థిని అడిగాను సుశీల మెప్పుకోసం - నటరాజన్ ఏదో పద్యం చదివినట్టూ, తను విన్నట్టూ శర్మ చెప్పేడుట. ప్రిన్సిపాలు రూంలో మరొక ఆడదికూడా ఎవరో ఉందిట. నటరాజన్ చెప్పినవన్నీ ఆవిడా విందిట

ఆ మెయిల్లో పేపరు వస్తోందని తెలిసి - ఆ పేపర్లో పరీక్షా ఫలితాలు ఉన్నాయని తెలిసి - ఆ మెయిలే లేటయితే విద్యార్థు. కెంత ఆశాభంగంగా ఉంటుందో ఆ ఆలవారంనాడు అందరూ అంత బాధపడ్డారు. ఎలాగయితేనేం ఆదివారం గడిచింది సోంవారం పొద్దున్నే మా శర్మ హాస్టలునుంచి రూం ఖాళీచేసి వెళ్లిపోతూంటే మాత్రం ఆశ్చర్యం పట్టలేకపోయాను. అన్ని సంగతులూ క్రమంగా అందరికే తెలిశాయి. నేను విన్న సంగతులు, కథలా ఉండేటట్టు మధ్య మధ్య కొంత ఊహా కల్పనచేసి మీకు అందజేస్తాను.

*　　*　　*

అవాళ మేటినీనుంచి - దారిలో నట

( 48వ పేజీ చూడండి)




# 16

సదానందం, డాక్టర్ వీరభద్రరావుగార్ని తీసుకొచ్చి చూపించాడు చెల్లెల్ని. చెల్లెలు జయ కొంచెం నీరసించినట్లుంది. వీరభద్రరావు కొత్తగా పెట్టాడు ప్రాక్టీసు. లోగడ పరిచయస్తుడే

"ఏమమ్మా! నువ్వు పడిపొయ్యేముందు, ఎలా వుంటుందో చెప్పగలవు?" అని అడిగాడాయన జయను.

జయ, గుండె దడదడలాడుతుందండి. కళ్ళు గొప్ప వెలుగు చూస్తున్నట్టుంటాయి. అంతేనండి, తర్వాత ఏమిటో తెలియదండి" అంది జయ.

రంగయ్యగారూ, వరలక్ష్మమ్మగారూ గూడా పక్కనే వున్నారు. అప్పుడు ఉదయం తొమ్మిదిగంటలవుతోంది.

ఆ తర్వాత, ఆమె మొదట పడిపోయిన రోజున జరిగినసంగతులన్నీ డాక్టరు అడిగాడు వారాల పుల్రాడికథా, సదానందం బొమ్మ ప్రసక్తి, అన్నీ చెప్పారు; డాక్టర్ ఐదుదారు నిమిషాలు తీవ్రంగా ఆలోచించి, "అమ్మాయి కడవరకే కొంత దిగులువుండేవుండాలి. దానిమీద, ఆ పుల్రాడి కథా, దాన్నే బొమ్మగాచూడ్డం జరిగాయి, ఇంకేం మెంటల్ షాక్ నెస్ వొచ్చింది. నరాలు బలహీనంగా వున్నాయి ఇదొకరకం హిస్టీరియా ముదరనిస్తే, ఇన్‌సానిటీ లోకి కూడా మారొచ్చు." అన్నాడు.

"ఇన్‌సా.. అదేమిటిరా సదానందం?" అని అడిగింది తల్లి అదుర్దాగా, కూతురును దగ్గరకి లాక్కుంటూ.

"మరేంలేదులెండి." అంటూ డాక్టర్ సర్దాడు. "దీనికి తిన వల్సిన అవసరంగల మందులేమీ లేవు ఆ అమ్మాయిని సంతోషపెట్టే వుపాయాలు చూడండి. నన్నడిగితే ఒకమాట చెబుతాను." అన్నాడు.

"ఏమిటో చెప్పండి చేస్తాం! అమ్మాయికన్నానా" అన్నాడు రంగయ్యగారు కళ్ళజోడు సర్దుకుంటూ

"తొరగా, అమ్మాయిని అత్తవారింటికి పంపించే ఏర్పాటు చెయ్యండి." అన్నాడు డాక్టర్.

జయ తల్లివేపుతిరిగి, ఆమె రొమ్ముల్లో తలదాచుకుంది

"నిజమే...చేస్తాలెండి" అన్నాడు రంగయ్యగారు.

"నేను మొదట్నించీ మొత్తుకుంటూనే వున్నాను" అంది తల్లి, కూతురు తల నిమురుతూ.

"అత్తవారింటికి పొయ్యేవరకూ, కాలక్షేపం కోసం కొన్ని పుస్తకాలూ, సినిమాలూ చూపించండి ట్రాజడీలూ, అవీవొద్దు." అన్నాడు డాక్టర్.

"సినిమాలకి పోతూనేవుంటుంది లెండి. పుస్తకాలంటే చెవి కోసుకుంటుంది" అన్నాడు రంగయ్యగారు.

డాక్టర్ లేస్తూ "ఈ తడవ ఫిట్ వొస్తే వెంటనే నాకు కబురు చెయ్యండి. వొచ్చిచూస్తాను.

సదానందం, ఆయన్ని అనుసరించి, వాకిలిదాకా వెళ్ళి, ఫీజు పదిరూపాయలూ చేతులోపెట్టి, తన గదిగుమ్మం దగ్గిరేవుండిగనుక, "డాక్టరుగారూ, మా చెల్లి ఈ బొమ్మచూసేపడిపోయింది, ఆ వేళ" అని తను గీసినబొమ్మ చూపించాడు.

డాక్టర్ ఐదునిమిషాలు గడపదగ్గిరేనుల్చుని, ఆ బొమ్మని పరీక్షగా చూశాడు. "చాలా సహజంగా గీశావోయ్, నువ్వు ఇంత ఆర్టిస్టువనుకోలేదు. ఈ బొమ్మని, అఖిలభారత చిత్రకళా ప్రదర్శనానికి పంపించు! బాగుంటే ప్రైజురావచ్చు" అన్నాడు, గదిలోకి వస్తూ. గోడలకున్న బొమ్మల్ని చూసి, చిరునవ్వు నవ్వాడాయన, "అయితే ఇదినీకు 'హాబీ' కాదన్నమాట." అని అడిగాడు

డాక్టర్ కి నల్లభైఏళ్ళు పైనవుంటాయి ఆయన ఆలా అకస్మాత్తుగా మెచ్చుకునేసరికి సదానందానికి కొంచెం సిగ్గు కొంత అలాంటిదేదో చక్కిలిగింతలు పెట్టినట్టయి, "మీరు మరి అభిమానం చూపుతున్నారు" అన్నాడు, తన ఆల్బం డాక్టర్ గారికి ఇస్తూ.

డాక్టర్ నుల్చున్న పాళంగానే, ఆ బొమ్మల్ని వరసగా చూస్తూ, "అబ్బాయీ! నేనూ తీరికవేళ్ళల్లో బొమ్మగీస్తూవుంటాను. కొన్ని కుదురుతాయి. అన్నీ కుదరవు, అన్నిటమీద మొదటిసంగతి మనసు కుదరదు! నేనూ కళాప్రదర్శనాకి ఓ చిత్రంగీసి పంపిస్తున్నాను అందుకని చెప్పాను. నామాటవిని పంపించు...అయితే అబ్బాయి! చూశావూ! నీ అభిరుచిని చాలా బాగా నీ చిత్రాల్లో వ్యక్తపరచ గలుగుతున్నావోయ్ అదే అందరికీ కుదరదు, ఇది నిజంగా, నీకు వరప్రసాదంలాంటిది...నాలో ఓమాటు, మాయింటికి రాగలవూ? నా బొమ్మల్ని చూపిస్తాను!" అని అడిగాడు, ఆల్బం టేబిల్ మీదపెడ్తూ.

"తప్పకుండావొస్తానండి. రోజూవస్తాను. మీ దగ్గిర ఎంతో నేర్చుకోవాలిగూడానూ" అంటూ బయల్దేరాడు సదానందం.

డాక్టర్ గారి గుర్రబ్బండిలో, ఇద్దరూ, డాక్టర్ గారింటికి బయల్దేరారు

ఇంట్లో, రంగయ్యగారు, వరలక్ష్మమ్మ. దిగాలుపడి ఆలోచిస్తున్నారు.

వరలక్ష్మమ్మగారు, "రెండొందలు పోగొట్టుకొచ్చారు గదా, ఈ నెల జరిగేదెలా?" అన్నది.

"జరక్కేం? బాగానే జరుగుతుంది. మొన్ననే పొలం తాకట్టు పెట్టి తెచ్చినబాకీ తీర్చమని నోటీసు ఇచ్చాడు కరణంగారు. అది

# ★ అపస్వరాలు ★

అమ్మేసి, బాకీపోను మిగిలింది తెస్తాను. తర్వాత సంగతి తర్వాత చూద్దాం" "ఏవో ఏటా ఇన్ని గింజలొస్తున్నాయి, వేణ్ణీళ్ళకి తోడు చన్నీళ్ళన్నట్టుగా అది కాస్తా గంగలో కలిసిపోతుంది! అమ్మాయి తాలూకు ఇవ్వాల్సిందెట్లా ఇస్తారూ? అబ్బాయి చదువెట్లా?"

"తిరిగి నేనూ అవే ప్రశ్నలు నిన్ను వేస్తాననుకో; నువ్వేం చెబుతావు?" అని అడిగాడు రంగయ్యగారు విసిగిపోయి.

"బాగానే వుంది లక్షణం. ఇంట్లో మగ్గే ఆడదేం చెబుతుందండి!" అన్నది వరలక్ష్మమ్మగారు.

"అబ్బాయికి చదువుమీద ఇష్టంవున్నట్టేం కనపడదు. ఎప్పుడూ బొమ్మలుగీస్తూకూర్చుంటాడు. నువ్వూ నేనూ ఎందాకా ఎత్తిళ్ళు పెడతాం చెప్పూ! ఒకవేళ ఖర్మంజాలక తప్పితే—రెండు వేలూ బూడిదలోపోసిన పన్నీరవుతుంది!"

"ఏమిటోనండి నా కంతా అయోమయంగావుంది!"

"ఆ పబ్లిషరు ఇంకా డబ్బు పంపించలేదు. మరునాడిస్తానన్న మాట. ఇవ్వాళపోయి కనుక్కుంటాను. అమ్మాని ఎటుతిరిగీ శ్రావణ మాసంలో పంపించేద్దాం." అన్నాడు భర్త, ఏమిటో ఆలోచిస్తూ మళ్ళీఅన్నాడు. "నా కళ్ళేమో, నానాటికి తీసి కట్టుగా అవుతున్నాయి. కళ్ళజోడు పవర్ మార్చిమార్చి ఇప్పటికే కళ్ళజోడు తీస్తే అన్నీ మొద్దుగా అగుపిస్తున్నాయి. ఈ కాస్తచూపూపోతే—" అంటూవుండగానే భార్య, "ఊరుకోండి, అవాచ్యాలు మాట్లాడుతూ!" అంది మందలించినట్టు.

"అవాచ్యాలేమిటే పిచ్చిమొహమా! చదివి చదివి—పిచ్చెత్తి నట్లు, రాసిరాసి కళ్ళుపోతున్నాయి. ఫలితమేలేదుగాని! ఆరాముల కింకా దయగలగలేదు. ఆ రాసేభాగవతం, సగంలో ఆగిపోయింది గదా! అమ్మాయి ఇట్లా అయింది......ఏమిటోపోవే—నాకు ఇదంతా తల్చుకుంటే బుర్రతిరిగిపోతూవుంది." అన్నాడు.

జయ, మెల్లిగా లోపల్నించి నడిచివొచ్చింది, తండ్రిదగ్గరకి. కూతుర్ని చూడగానే నాన్న, "అమ్మా, ఇవ్వాళ, కాస్తరాద్దాం, వొస్తావా?" అన్నాడు.

"వొస్తానాన్నా! ఇవ్వాళ కులాసాగానేవుంది" అందిజయ.

సరిగ్గా ఈ సమయానికే గోడగడియారం, పదిగంటలు కొట్టింది. బయట పోస్టుమెన్ కేకేసి, ఓ కవరు గడపలోనుంచి లోపలికి విసిరేసి వెళ్ళాడు.

జయ వెళ్ళి కవరుతెచ్చి తండ్రికిచ్చింది.

రంగయ్యగారు కవరువిప్పి చదివాడు లోపల్లోపల ఆయన మొహం మారింది. "వియ్యంకుడు రాశాడు." అన్నాడు.

"ఏమని?" అంది తల్లి ఆదుర్దాగా.

"శ్రావణమాసంలోనే 'ఔపాసన ముహూర్తం పెట్టించమని రాశాడు. పైకం అప్పటికిస్తే చాలునట"

"మనం అనుకుంటున్నదేగా! ఇంకో మూణ్ణెల్లు; ఈలోగా ఆ డబ్బేట్లాగో సంతనచేయాలి...ఓ ముక్క రాసి పడెయ్యండి వాళ్ళకీను." అంటూ వరలక్ష్మమ్మగారు లోపలికి వెళ్ళింది.

తండ్రి, అమ్మా! జయా! స్నానంచేశావా? ఆ పట్టుచీర కట్టుకురా. ఈలోగా నేనూ స్నానంచేసి వస్తాను. పూజామందిరం గదిలోవుండు,......అంటూ దొడ్లోకి వెళ్ళాడు.

తండ్రికివున్న ఆ కావ్యగౌరవాన్ని గూర్చి గర్వపడుతూ జయ వెళ్ళింది.

## 17

ఎండాకాలపు శెలవల తర్వాత కాలేజీలు తెరిచారు. బ్రహ్మానందం కాలేజీ చదువుకి స్వస్తిచెప్పాడని తెలిసింది. సదానందం, ఆవేళ కాలేజీ వొదలగానే బ్రహ్మానందం ఇంటికి పరిగెత్తాడు. బ్రహ్మానందం చేత సంచీ పట్టుకుని, మార్కెట్టుకిగాబోలు బయల్దేరుతున్నాడు. సాయంత్రపు ఎండ పచ్చగా ఆహ్లాదకరంగా వుంది.

"ఏంరా! కాలేజీ మానేశావుట!" అని అడిగాడు సదానందం వాడితోబాటే మార్కెట్టుకి నడుస్తూ.

"అవునురా! అప్పుడే న్యూసు పాకిందీ!" అంటూ నిష్కల్మషంగా నవ్వాడు.

"పాకింది. నా చెవిని పడబట్టి, వుండబట్టలేక వొచ్చారా. ఏం ఇట్లా చేశావు?"

"నేను చేసిందేముంది ఇందులో? దానంతట అదే, అట్లా పరిస్థితులు పరిణమించినాయి."

"అయితే......" ఏమనాలో తెలీక సదానందం ఆలోచిస్తున్నాడు.

"అయితే-లేదూ, గియితే లేదు! నే నొక్కణ్ణీ బి.య్యే పాసైతే సరా! నాతర్వాత తమ్ముళ్ళు ముగ్గురూ, చెల్లెలొకమ్మాయీ వున్నారు! వాళ్లకి కనీసం అక్షరజ్ఞానమేనా కలగాలా? అట్లా అయితే, నేను చదువు మానుకోవాలి. అంతే. అంతకంటే మరేం లేదు."

"అంటే నువ్విప్పట్నించి, జీవితసంగ్రామంలో పడ్డావన్న మాట" అన్నాడు సదానందం.

"జీవితం ఏమిటోయ్! సంసారం అను. నాన్న సంపాదన ఎటూ చాలటం లేదు. మనమూ ఏదో పనిచేసి నాలుగు రాళ్లు తెస్తేగాని కాలం సవ్యంగా గడవదు. యస్. యస్. యల్. సి సర్టిఫికేట్ పట్టుకుని రేపట్నించీ చాంద్రాయణం తిరగాలి" అన్నాడు బ్రహ్మానందం బరువుగా.

"అవును. కాని, ఎస్. ఎస్. ఎల్ సి వాడికి వుద్యోగాలు దొరుకుతా యంటావా? — గ్రాడ్యుయేట్స్‌కే దిక్కు లేదు" అన్నాడు సదానందం, నడుస్తూ చుట్టూ చూస్తూ సాయంత్రపు ఎండ ఉభయుల చొక్కాలమీదా పడి మెరుస్తోంది. ఇద్దరూ, మార్కెట్టువేపుగా నడుస్తున్నారు చుట్టూ షాపులూ, హోటళ్ళూ కిటకిటలాడుతూన్నాయి. జీవితం పచ్చగా కళకళలాడుతున్నట్టూ, అందరూ సంతోషంగా ఉత్సాహంగా వున్నట్టూ కనిపిస్తున్నారు

"నేను, ఆ వుద్యోగాల సంగతి చెప్పటంలేదు. ఏ పనైనాసరే అంటున్నానోయ్. చాకిరీ చెయ్యడం అంటూ వొచ్చాక, ఏది నౌకరీ కాదు, ఏది అర్జన కాదూ?" అని అడిగాడు బ్రహ్మానందం.

"నిజమే. అట్లా ఆలోచిస్తే, ఏదైనా పనే అందుకు సిద్ధపడ్డావా అనే అడుగుతున్నాను."

"నేను సిద్ధపడకపోయినా, పరిస్థితులు..." ఆపేసి బ్రహ్మానందం, సదానందం ముఖంలోకి చూశాడు.

సదానందం ఒకసారి బరువుగా శ్వాస విడిచి, "పరిస్థితి! ఏమిటా పరిస్థితి? దానికి మనం లొంగిపోవాల్సిందేనా?" అన్నాడు.

"లొంగక చేసేదేముంది? ఒకవేళ మనంఒకళ్ళం ఎదురుతిరిగినా జరిగేదేముంది? బూడిదేనా కనపడకుండా నశించటమే!"

"కాబోలు!" అంటూ సదానందం కాఫీహోటల్లోకి దారితీశాడు.

"వొద్దురా! ఈ అలవాటు మానేస్తున్నాను నేను." బ్రహ్మానందం వెనకాడుతున్నాడు.

"రావోయ్, నువ్వు డబ్బెట్టి తాగొద్దులే. నే నిప్పిస్తే తాగటానికేం?" అంటూ సదానందం మిత్రుని చెయ్యిపట్టుకుని లాక్కెళ్ళాడు లోపలికి.

హోటలు జనంతో కిటకిటలాడుతోంది ఇద్దరుమిత్రులూ వెళ్లి ఓమూల కూర్చున్నారు.

"బ్రహ్మానందం, నేను ఓ బొమ్మగీసి, అఖిలభారత చిత్రకళా

తసర్చనానికి పంపించాశోయ్!" అన్నాడు, సదానందం ఉన్నట్టుండి.

"అలాగా! అదృష్టవంతుడివోయ్, ఏదో ఒక కళనైనా అభ్యసిస్తున్నావు! దానికి ప్రయిజు రావాలి! అవేళ నీచేత టీపార్టీ చేయించాలి!" అన్నాడు మిత్రుడు.

ఇద్దరూ కాఫీ చల్లార్చి తాగటం సాగించాడు

"ప్రైజు వస్తుందో రాదో ఎవడు చెప్పగలడుగాని, అదిమంచి బొమ్మ అనిమాత్రం ఒప్పుకోవాలి!" ... సదానందం.

బ్రహ్మానందం నవ్వాడు, "అవును, ప్రతి ...కి ఆహా ఆత్మవిశ్వాసం అనా లేకపోతే ఏ పని ... !' అన్నాడు.

"ఏదంతా సూత్రప్రాయంగా ... అలవాటు! కాని . బొమ్మలేస్తూవుంటే పొందే ఆనందం, ఎన్ని లక్షలరూపాయల విలువగల ఏ ఇతర ఆనందానికీ—తక్కువకాదోయ్. అది అనుభ

(49-వ పేజీ చూడండి)



# చుట్టాలొచ్చారు

"రాధా! త్వరగా టీ చెయ్యి. సినిమా కెళ్దాం అన్నాడు గోపాలం కోటిప్పుతూ" అన్నాడు గోపాలం కోటు విప్పుతూ—కథల్లో, గోరువంక చిలకమ్మని పలకరించవలసిన పద్ధతిలో.

సావడికి కుడివేపు ఉన్న నట్టింటి కిటికీ గుండా వంటింట్లోకి శ్రద్ధగా చూస్తోంది రాధ.

"ఆ జేవిటా సరసం అన్నాడు గోపాలం పడక కుర్చీలో కూర్చుని బూటిప్పుతూ" అన్నాడు గోపాలం పేము కుర్చీలో కూర్చుని బూటు విప్పుతూ.

"ఊఁ" అంది రాధ వంటింటిమీది దృష్టి మళ్ళించకుండానే.

గోపాలం రాధవంక తలతిప్పి చూచాడు. రాధ గోపాలంవైపు చూడకుండానే చెయ్యి మాత్రం సారించి రమ్మనట్లు వేళ్లు ఆడించింది.

"అందమైన అమ్మాయి చెయ్యి ఊపినట్లుంది" అనుకున్నాడు గోపాలం.

రాధ అమ్మాయి. రాధ అందంగా ఉంటుంది.

రాధ చెయ్యి ఊపి పిలిచింది కూడా.

"ఏమిటి సంగతి?" అన్నాడు గోపాలం లేవకుండానే.

ఈసారి ఇద్దరు 'ష్' అని అతన్ని మందలించారు.

ఏదో ఉంది విశేషం అని చటుక్కున నిర్ధారణ చేసుకుని వంటింట్లోకి నడిచాడు గోపాలం. కిటికీలోంచి శ్రద్ధగా, ఊపిరి బిగబట్టి చూస్తున్న రాధ కొంచెం జరిగింది. గోపాలం వంటింట్లోకి తొంగిచూసి కెవ్వుమన్నాడు నిశ్శబ్దంగానే. అయినా రాధ కంగారుపడి, ఇందాకటి అందమైన వేళ్లతో గోపాలం పెదిమలను అదిమి కేకింతను వారించింది.

నిజానికి గోపాలం కేకింత కాని, రాధమ్మ 'ఇష్' అనడం కాని వంటింట్లో ఎవరికీ వినబడలేదు. లోపల నానా హడావుడిగా ఉంది. కళ్లప్పచెప్పి చూచిన గోపాలరావుకి కంటికి నిండుగా మనుషులు కనబడ్డారు. చెవినిండా గోల వినపడింది. వేపసం ఘాటుతో ముక్కుకి మతిపోయింది.

[illegible]

లోపల వేపుడాల టూర్నమెంటు జరిగిపోతోంది. ఒక పెద్ద సోంపేట దొడ్డమ్మగారు భారీఎత్తున దుక్కల్లాంటి కంద ముక్కలు వేయించేస్తున్నారు పెద్ద అట్లకాడ పట్టుకొని. ఆ ముక్కలికి తగినంత పెద్ద బూరెలమూకుడూ దాన్ని మోయ తగినసైజులో పెద్ద ఇనప పొయ్యి ఉన్నాయి. ఆదివారాలలో తలంట్లు పోసుకునే రోజునే గోపాలం తాలూకు సంసారంవారు ఆపొయ్యిని వాడకంలోకి తెస్తారు. రాధమ్మ దృష్టిలో గోపాలం చేసే అవకలివక ఖర్చులా ఆ పొయ్యిలో కర్రలు జ్వలించాయి.

దొడ్డమ్మగారి పక్కనే ఒక చిన్నసైజు బుచ్చికక్కగారు ఒక పెద్ద కుంపటిమీద చిన్న మూకుడుంచి ఓ మాదిరి సైజు బంగాళదుంప ముక్కలు వేయించేస్తున్నారు. ఆ కుంపట్లో కణకణమండే చింతబొగ్గులు గోపాలం దృష్టిలో రాధమ్మ ఖర్చులా కరిగిపోతాయి. ఆ పొయ్యికీ ఈకుంపటికీ మధ్య పడిఉన్న నూనెగిన్నె, మూడో తారీఖు పొద్దున్న మూలపడిఉండే గోపాలం మనీపర్సులా దిగాలు మొహం పెట్టి "ఓ యజమానీ! నిస్సహాయురాలను సుమా!" అంది.

ఈ ఆర్తనాదం విన్న గోపాలరావు వంటింట్లో జరుగుతున్న టూర్నమెంటు రంగంమీదికి ఉరకడానికి ఉద్యుక్తుడయ్యాడు. కాని మూకుళ్లో వేగుతున్న దుక్కల్లాటి కంద ముక్కలకు దిక్కుమొక్కూ లేక నానా అల్లకల్లోలంగా ఎగిరెగిరిపడుతూ ఉంటే తను వెళ్ళినా అక్కడి జనం కంటికి ఆనకపోవచ్చునని తోచి విరమించుకున్నాడు.

వంటింటికి అవతలగా చిన్న మెట్రోపాలిటన్ పెరడుఉంది. ఆ పెరట్లో ఒక పెద్దాయన అంగోస్త్రం కట్టుకుని పిట్టగోడకి చేరబడి విలాసంగా కాలుమీదకాలు వేసుకొని, అర్ధనిమీలిత నేత్రుడై బట్టతలని రాచ్చుకుంటున్నాడు. ఆయన బొజ్జమీద ఓ దిట్టమైనపాప అట్టముక్క ఒకటి పెట్టి మసిబొగ్గుతో బొమ్మవేసుకుంటూ పాడుతోంది. ఆ చిన్న పెరడులో ఇంకా మిగిలిన కొద్దిపాటి చోటులోనూ బుద్ధిమంతుడివలె కనపడే ఒక అబ్బాయి అతి పొదుపుగా మఠం వేసుకుకూర్చుని పెద్దాయనచెప్పే దారిక

ర్ధులు చిన్నసైజు పద్దుపుస్తకంలో రాస్తున్నాడు. ఇంకా మిగిలిన కొద్దిచోటులోనూ కొంచెం బొద్దుగా బంగారుబొమ్మలా ఉన్న ఒక ముద్దరాలు మోకాళ్ళపై గడ్డం ఆనించి పచ్చని పాదాలను ప్రేమతో కౌగలించుకున్న వెండిపట్టీలను మునివేళ్ళతో నిముఋతూ, పద్దులురాస్తున్న అబ్బాయివంక ఎంతో ఆప్యాయంతో, అంతను మించిన గౌరవంతో ఇంకెంతో భక్తితో రెప్పవాల్చకుండా చూస్తూంది.

ఈ కమనీయ దృశ్యాన్ని రెండుక్షణాలు చూసిన గోపాలం అరక్షణంపాటు పెరట్లోని అమ్మాయిని సోయగాన్ని మెచ్చుకొని మూడోక్షణంనుండి రాధవంక ప్రశ్నార్థంగా చూడడం ప్రారంభించాడు.

"ఏమో!" అన్నాయి రాధకళ్ళు. ఆమె నల్లటి కనుబొమలు చిత్రంగా పైకి లేచి చిన్న వంపుతిరిగాయి.

"బాణంవెయ్యనా నాన్నా వాళ్ళమీదకి?" అన్నాడు రాధ చెంగుచాటున ధనుర్ధారుడైదాగిఉన్న శంకరం.

'ఛవ్' అన్నాడు గోపాలం.

"ఉష్" అంది రాధ మళ్ళీ గోపాలం పెదిమలను ఇందాకటి అందమైన మునివేళ్ళతో అదుపు చేస్తూ.

'హుఁ' అని గోపాలం విసుక్కోబోయాడు.

వంటింట్లో ఎవరో ఫెళఫెళ నవ్వారు. గోడ, కిటికీ, దాన్ని పట్టుకున్న గోపాలరావు, రాధ, శంకరం, వాడి విల్లమ్ములు అదిరిపోవడం జరిగింది.



పూర్వం రాజులు ద్వంద్వ యుద్ధాలు చేస్తూఉండేవారు. కథలు అయిపోవస్తూండగా విజయసింహుడికీ, ద్రోహంచేసిన దుర్జయుడు లేక దుర్ముఖుడికీ పోరాటం జరిగేది. అపుడు వాళ్ళు సరాసరి నోరుమూసుకు తన్నుకోవడం, పొడుచుకోవడం ద్వారా సంగతి సందర్భాలు ఓ పట్టాన తేల్చుకునేవారుకారు.

"ఓరీ! దుర్మతీ సింగంబుముందు జింకపిల గాటుమా? నాముందు నీవేడ! ఇదె వధించితి" అని విజయుడు అనేవాడు. "ఓరీ కబుర్లకేమిలెమ్ము. కాసుకొమ్ము. ఇదె వధింతు సుమ్ము" అని దుర్ముఖుడు బదులు చెప్పేవాడు. ఈ ధోరణిలో మంచీ చెడ్డా మాట్లాడుకుంటూ పోట్లాడుకునేవారు.

కందముక్కలు భారీ ఎత్తున వేయించేస్తున్న దొడ్డమ్మగారు, బంగాళాదుంపలు వేయిస్తున్న బుచ్చికక్కిగారిని హేళన చేస్తూ ఫెళ్లున నవ్వింది.

"ఏవండో ఒదినా! ఎందుకమ్మా ఆవేషం? కూరొండుతున్నానని ఒప్పేసుకోరాదు? వేపడం అంటే మజాకా కాదు - ఎవరికి పెడితే వాళ్ళకి ఒళుపొచ్చేసేడానికి" అంటూ ఇంకో గరిటెడు నూనె కందముక్కలమీద పోసింది.

బుచ్చికక్కిగారు విలాసంగా నవ్వుతూ, అరమోడ్పు కన్నులతో బంగాళదుంపల వంక చూసింది. "పోదురూ. మీరు బొత్తిగా ఇది......ఏదో శాస్త్రం చెప్పినట్టుంది... కాపోయినా, అలా నూనె దిమ్మరించేసుకుంటే కడుపులో వికారపెట్టదు? పైగా ఉడకేసి వార్చి పుల్లపెట్టి మరీ వేయిస్తున్నారాయె... వేపడం అంటే ఇది. నేవళీకం ఉండదమ్మా?" అంటూ పెంకుముక్కలతో మూకుడునిపైకెత్తి ఒక్కసారి కుదపాయించింది. బంగాళదుంప ముక్కలన్నీ పాలోమంటూ పైకెగిరి గోలోమంటూ మళ్ళీ మూకుట్లో పడ్డాయి.

గోపాలరావు భరించలేకపోయాడు ఈ ధోరణి. కాస్త భయస్థుడవటంవల్ల పెళ్ళాం చెయ్యి, కుర్రాడి రెక్కా పట్టుకుని, సరాసరి హాలులోకి వచ్చేశాడు.

"ఎవరు వాళ్ళు" అన్నాడు కోపంగా.

రాధ నవ్వింది. "వెళ్ళి అడగండి. ఎవరో మీ వాళ్ళేట."

"నాకు తెలీదు" అన్నాడు గోపాలం.

"మీ కొడుకు నడగండి. వాడే లోపలికి పిలిచాడు."

గోపాలం ఆలోచించాడు. ఈ విషయం ఇక్కడ కాదు మాట్లాడవలసింది. మూడిళ్ళవతల మీసాలరావు ఇల్లుంది. వాడు ఊళ్ళో లేడు. తాళం చెవులు తనదగ్గిరే ఉన్నాయి. అక్కడికి పోయి మంచీ చెడ్డా మాట్లాడుకోవడం మంచిదనుకున్నాడు.

"మీసాలం ఇంటికి పద" అన్నాడు.

"ఎందుకండీ. మీరే పలకరించి అడగరాదు?" అంది రాధ.

"కాదు నీకు తెలీదు. ముందక్కడికి పద. స్థిమితంగా మాట్లాడుకుందాం...పద పద పద" అన్నాడు గోపాలం.

"పదండి" అంది రాధ అలమారులోంచి తాళం చెవులు పట్టుకొస్తూ.

"ఇదెలాగ? 'ఇక్కడ దొంగతనము లు చేయరాదు' అని బోర్డు కడదామా!" అన్నాడు గోపాలం హడావుడిగా నడుస్తూనే నవ్వుతూ.

"మరే యజమాని త్వరలోనే తిరిగి రాగలడు జాగ్రత్త అని పరా కూడా

## పెద్దాళ్ళొచ్చారు ★

రాయండి" అంది రాధ.

మిాసాలరావు ఇంట్లో చతిగిలబడ్డాక, "గబగబ చెప్పండి" అన్నాడు గోపాలం.

"నువ్వు చెప్పరా" అంది రాధ కొడుకుని మొచేత్తో పొడుస్తూ.

"నువ్వే చెప్పు నేను ఊ కొడతాను" అన్నాడు శంకర్రావు.

"ఉద్ధరిస్తావు...అదికాదండీ నేనేమో వంటింట్లో కుంపటి రాజేస్తున్నాను. వీడు హాల్లో ఆడుకుంటున్నాడు. అంతలో ఎవళ్లో గబగబ మాట్లాడేస్తున్నారు. తీరా వచ్చిచూస్తే వీళ్లు, వాళ్లెవళ్ళో ఎలా వచ్చారో - మా బుల్లిబాబునే అడగండి" అంది రాధ.

"నువ్వు చెప్పరా" అన్నాడు గోపాలం.

"అదికాదు నాన్నా...మరేమో..."

"ఒరేయ్ చిన్నా. నీకు సినిమా ఇష్టమేనా?"

"హిందీ తెలుగూ ఇష్టంలేవు. ఇంగ్లీషు"

"రైట్ - ఇంగ్లీషు సినిమాకి తీసుకెళ్తాను కాని.."

"అదేమిటండీ - బొత్తిగా మతిపోయిందే ఏటి? వాళ్ళ నింట్లో వదిలేసి సినిమా కెళ్తారా?" అంది రాధ.

గోపాలం విసుక్కున్నాడు. "చెప్పనీ బాబూ. వాళ్లెవరో గబుక్కున చెప్పేయ్ చూద్దాం."

శంకరం చెప్పేశాడు చకచక. "అదికాదు నాన్నా మరేమో ... నేను ఆడుకుంటున్నా, బండొచ్చింది - వాళ్లు దిగి లోపలికొచ్చారు మా నాన్నేడీ అన్నారు. గోపాలరావుగారి ఇల్లేనా అన్నారు. అవునండి. లోపలికి రండి. కూర్చోండి. మంచి నీళ్ళు కావాలాండి. మా నాన్న లేడండి. ఇప్పుడే వస్తాడండి" అని చెప్పాను. ఓ పెద్దావిడ లేదూ? ఆవిడేం, నన్నెత్తేసుకుని 'నా తండే' అని ముద్దుపెట్టేసుకుంది నాన్నా. మళ్ళీనేమో దింపాక ఏవండి మీకు కాఫీ కావాలా ఓల్టీనా ఆర్లిక్సా అని అడిగాను. అప్పుడేమో..."

"చాలు బాబూ చాలు.. ఎవరు రాధా. చెప్పరాదూ?" అన్నాడు గోపాలం.

"అయ్యో కర్మ! నాకు తెలీదండి! మీరు మప్పిపెట్టారుగా బుద్ధులు. అందుకని వీడే లోపలికి పిల్చి మర్యాద చేసేశాడు. నేను వంటింట్లోంచి వచ్చేసరికే వాళ్లు వరండాలో సామాను సర్దేసుకున్నారు."

"అదేంమాట ఆ మాటను చెరిపెయ్. కుర్రాడికి మంచిబుద్ధులు నేర్పడం తప్పా? ఇంటికొచ్చినవాళ్ళని పొండని తిట్టమని, నేర్పమంటావా? వాడికి తోచింది వాడు బాగానే చేశాడు...వాడికన్నా, ఆఖరికి నాకన్నా తెలివైనదానివనుకునే నువ్వేం చేశావంట? ముక్కు మొహం ఎరగని పరాయివాళ్ళని వంటింట్లో ముక్కల వేపడాలు చేసుకోమని విచ్చలవిడిగా వదిలేసేసి పైగా కిటికీలోంచి తొంగిచూస్తున్నావా? మీరెవరండి? ఏవూరు? దొంగలా దొరలా? మీకు నేను తెలుసా? మా ఆయన తెలుసా? లేపోతే మా అబ్బాయితో పరిచయం మాత్రమేనా?' అవటాని మంచీ చెడ్డా అడగద్దూ?" అన్నాడు గోపాలరావు.

రాధ మొహం ముడుచుకుంది. "ఇదిగో చూడండి. వాళ్ళెవరో పెద్దమనుషులు. ఇంటికొచ్చారు. మర్యాదచేశాను. పెద్దవాళ్ళున్నారుకాబట్టి నలుగురికీ వాళ్లే ఉడకేసి పడేస్తామన్నారు. మీ వాళ్లు కదా అనీ, వాళ్ళమాట కాదనలేకా సరే అన్నాను. మీకూ తెలీపోతే వెళ్లిపోతారులెండి. అంతే కాని వాళ్లు దొంగలనడం తప్పుకాదండీ .. మనుషులమీద బొత్తిగా ఇంత అపనమ్మకం అయితే ఎలాగ?"

గోపాలం జాలిగా, కొంచెం హేళనగా మందహాసం చేశాడు. హూఁ అన్నాడు.

"చూడు రాధా! అందుకే ఆడవాళ్ళని ఆడవాళ్లు మొగాళ్లని మొగాళ్లు అన్నారు. నువ్వు నిజంగా చిన్నపిల్లవి సుమా నీకు తెలీదుకాని, ఇలా మొగుళ్లకి తెలిసినవాళ్లనుకుని పెళ్ళాలు, పెళ్ళాల చుట్టాలు కాబోలని మొగుళ్లు ఊహించుకుని, అమాంతంగా వచ్చేచుట్టాలకు ఇల్లు వదిలిపెట్టి గుల్లచేసుకున్న సంఘటనలు ఎన్నో ఉన్నాయి. హూఁ నీకేం తెలుసు చిన్నదానివి. లోకంలో ఈమధ్య అధర్మం, అసత్యం, వంచన, మోసం, టోకరా ఎంతగా పెచ్చుపెరిగిపోయాయో నీకేంతెలుసు? పేపరు చదివితేగా?.. కనీసం కథలేనా చదవవాయె; ఇలాంటివాళ్ళని, చూస్తూ చూస్తూ ఎలా నమ్మను?"

గంభీరోపన్యాసానికి మురిసిపోయాడు గోపాలరావు.

రాధ గఁయ్‌మంది "ఇంతకీ వాళ్ళు టోకరా మనుషులంటారు. ఎలా అన బుద్ధేసిందండీ ఆ మాట!"

గోపాలం జాలిగా నవ్వాడు మళ్ళా. "నాకు తెలుసుగా! నువ్వలా అంటావని దొంగలంటే గళ్ల లుంగీ నల్ల బనీను వేసుకుని కోరమీసాలు మెలేసుకుంటూ వస్తారని నీ ఊహ, కాబోలు ... ఇప్పుడు మనింటికొచ్చారు చూడు. వీళ్లోకరకం ఘరానా లన్నమాట. నేను లేనపుడు వచ్చేశారా. నవ్వుతూ పేలుతూ నాలుగు రోజులుండి సుష్టుగా వండుకు తినేస్తారు. ఉప్పూ పప్పూ అయిపోయాక ఏ చెంబో చేంతాడో పట్టుకు చక్కాపోతారు. అంతే. చూడు కావలస్తే".

"మీకేం ఆబెంగవద్దులెండి. ఉప్పూ పప్పూ, ఆఖరికి ఆ కూరముక్కలు కూడా వాళ్లే తెచ్చుకున్నారు. మీ చెంబూ చేంతాడూ అంతకన్న వాళ్లకక్కర లేదు." అంది రాధ.

"నీకు తెలీదు రాధా లోకం పోకడ."

"మీ కంతకన్న తెలీదు. తెలిస్తే కనబడ్డ వాళ్లందరినీ దొంగా దొరా అని చేరీజు వేసుకుంటూ కూర్చోరు. వెళ్లి మంచీ చెడ్డా మాట్లాడి మర్యాద చేస్తారు. మీ నాన్నగారు వింటే ఎంత కోప్పడతారో" అంది రాధ.

"ఏయ్ రాధా. నాకన్న తెలిసినట్టు

ట్లాడేవులే కాని, నీకేం తెలీదు. వాళ్ళెవరో కాస్తో కూస్తో మావాళ్ళే సెరుగుదురేమో నాకు తెలీదు కాని, వాళ్ళు రేపో మాపో వెళ్ళాక నా మాట నిజమవుతుందని నేను ఘంటాపథంగా చెబుతున్నా కావలంటే పందెం."

"సరే పందెం ఇంటికి పదండి. వాళ్ళని కాస్త పలకరిద్దురు గాని"

గోపాలం నిట్టూర్చాడు. "మళ్ళీ మొదటికొచ్చాం. వాళ్ళెవరో ఎలా వచ్చేశారో చెప్పావు కాదు."

"ఎవరేమిటి? దొంగలని మీరే తేల్చేశారుగా."

"అదుగో అదే వద్దు. ఎత్తిపొడుపులు ఎందుకు మధ్యన. నువ్వు నా కళ్ళముందు స్కూలు ఫైనలు ఫెయిలయినదానివి నా మాట విను ఇలాంటి ఘరానా గోల నేను బాగా ఎరుగుదును... కావాలంటే ఈసారి ఓపారం నేర్చుకుందుగాని. ముందు వాళ్ళెవరో చెప్పు వాళ్ళి పలకరించకపోతే బాగుండదు' అన్నాడు గోపాలం కొంచెం ప్రాధేయపడుతూ.

రాధ చెప్పింది "కందుముక్కలు వేయిస్తున్నావిడ పేరు దొడ్డమ్మగారు ఆవిడ కందుముక్కలు బాగా వేయిస్తారుట. రెండో ఆవిడ బుచ్చికక్కగారుట. వేపడాలు చేత కాని మనిషని దొడ్డమ్మగారన్నారు. పెరట్లో కూర్చున్నాయన బుచ్చికక్కగారి భర్త. ఆయన పక్కనున్న అబ్బాయి ఆయన కొడుకు. ఆ పక్కనున్న పిల్ల కోడలు అంటే ఈ దొడ్డమ్మగారికి కూతురన్నమాట

"మరే మాకా చాలా బావుంది" అన్నాడు గోపాలం కామెంటరీ ఒద్దు. కథ వినండి. ఎవరో వచ్చిన సందడివిని నేను సావిట్లోకి వచ్చేసరికి గోపాలం పెళ్ళానివా అమ్మా అన్నారు అప్పుడు మీ వాళ్ళనుకున్నాను 'పెద్దవాడి గార్ల చిన్నమాట గోపాలం' అన్నారు దొడ్డమ్మగారు. 'మరే ఎప్పుడో రెండు పుష్కరాలకింతం చూశాం. బొత్తి పుంటపిలకో' అన్నారు బుచ్చికక్కగారు 'మరే. నల్లగా చింతపండు ముద్దలా ఎప్పుడూ ఏదో ఓమూల చూసుకుని పీకల్లో కూరు చేసేవాడు' అన్నారు ఆ పెద్ద కూర్చున్నాయన. నలుపైతేనేం గుమ్మడిపండంత ఉండేవాడని."

"చాలు నీ వర్ణన ఎందుకులే అవి తీసేసి చెప్పు. నేనేం నలుపు కాదనలేదుగా.." అన్నాడు గోపాలం

రాధ చెప్పింది. "ఇంతలో వీడు మళ్ళీ కాఫీయా ఓల్టీనా అన్నాడు నేను మంచినీళ్లు కావాలా అంటూంటే.. "

"మీ సామ్రాజ్యం పోయింది గ్లాకోసు కొని వజ్రాలు పొదిగిన వెండి గ్లాసులో పోసివ్వనా అని కూడా అడుగుతారు హూఁ."

"అదే చేశాం చివరికి" అంది రాధ. "వాళ్ల పిల్లకి ఓవల్టీను అరగలేదట ఒంట్లో బాగులేదట వెంటనే ఈ వెధవాయి చడీ చప్పుడూ లేకుండా పరుగెత్తికెళ్లి పక్కవాళ్ళింట్లోంచి గ్లాకోజు అప్పుతెచ్చేశాడు."

"ఓరేయ్ శంకరం. నువు మీ తాతకి ఉత్తరం రాసి ఈ నెలనించి నీకు కావాల్సిన ఓవల్టీనుకే పరోపకారార్థం పంచదలచిన గ్లాకోసుకు డబ్బు తెప్పించుకో, నాకు జీతం మామూలుగా చాలేదేకాని..."

"అబ్బ వినండీ! వీడలా తెచ్చినందుకు ఆ దొడ్డమ్మగారు అమాంతం పైకెత్తేసి 'నా చచ్చిపోను నాతండ్రే. ఇలాటిమంచి గుణాలు అందరికీ వస్తాయా. పెట్టిపుట్టాలమ్మా' అంటూ బుగ్గలు నొక్కేసి ముద్దెట్టుకుంది ఆవిడజుట్టుపీకేసి ముక్కుగిల్లేసి కిందికి దూకేశాడు. సరే దానికేంగాని ఇంటికి పదండి .."అంది.

"బాణం వేసికోకేద్దును!"అన్నాడుశంకరం

"తప్పమ్మా శంకరం"అంది రాధ.

"ఇంతకీ వాళ్ళెవరో, నేనిక్కడ ఉన్నానని, నేను నేనే అని, అది నా యిల్లే అని నువ్వేమో ."

"మర్చిపోయా మరే వాళ్ళకి మీ రెలా తెలుసు? ..సంగతేమిటంటే వాళ్లు తిరపతి వెళ్తూ ఇక్కడ దిగారు ఇక్కడ ఇంజనీరు గారెవరో ఉన్నారట. ఆయన్ని బతిమాలి, కుర్రాడికి ఉద్యోగం వేయించాలని వచ్చారట మొన్ననే పెళ్ళయిందట లెండి. ఆ ఇంజనీరుగారు వాళ్ళకి తెలీదు. చిట్టెమ్మగారని ఇంకో బామ్మగారు ఉందిటలెండి. ఆవిడకి కొంచెం తెలుసుట ఆవిడ సిఫారసు చేసి ఉద్యోగం వేయిస్తుందిట. మనఇల్లు, మీ పేరు, చెప్పి ఆవిడ వీళ్లనిక్కడికి పంపి తను సరాసరి ఇంజనీరుగారింటికి వెళ్ళిందట. ఇంకా స్నేహపట్లో వస్తుందన్నారు .."

గోపాలం ఎగిరి గంతేసినంత పనిచేశాడు.

# ★ చుట్టాలొచ్చారు ★

"అరెరె. చిట్టెమ్మగారా! చిట్టెమ్మగారంటే యూమిన్.."

"ఏమో మీనో మానో నాకు తెలీదు. చిట్టెమ్మగారట. ధవిళేశ్వరంలో మిమ్మల్నెరుగునట. బుచ్చికక్కిగారు చెప్పింది."

"చెప్పావు కాదేం. ముందర అది చెప్పవేం. ఎవరో పరాయివాళ్లనుకున్నాను. చిట్టెమ్మగారంటె ఎవరో తెలీదు?- బామ్మగారు.. భద్రాచలం బామ్మగారు - ధవళేశ్వరం ...మువ్వొంకాయకూర. పదపద పద" అన్నాడు గోపాలం

రాధా నవ్వింది. "ఏం అంతతొందర? ఇప్పుడు మీరు చెప్పండి. ఎవరా చిట్టెమ్మగారు. మనింటి కెందుకురావాలి. భద్రాచలం ఏమిటి బామ్మగారేమిటి" అంది.

"రాధా అందుకే నిన్ను చిన్నపిల్ల అన్నాను. చిట్టెమ్మగారంటే.. హూఁ, ఏం తెలుస్తుంది నీకు. చిట్టెమ్మగారు ధవళేశ్వరంలో నా చిన్నప్పుడు మా ఇంటి పక్కవాటాలో ఉండేవారు. ఎంత ధాటీ మనిషి తెలుసా? ఇంజనీరు కాదు జవహర్లాల్ నెహ్రూతో అయినా సరే టకటక మాట్లాడేస్తుంది. నెహ్రూ ఏమిటీ అమ్మయ్య నా చిన్నప్పుడు గాంధీగారు వచ్చినప్పుడు ఎందరోన్నెతోసుకుని వెళ్లిపోయి అయిదురూపాయిలు ఇచ్చి దండంపెట్టింది. గాంధి బాబూ! నువు చాలా గొప్పవాడివిసుమీ! అంది."

రాధ ఆసక్తి ప్రదర్శించింది.

"ఏయ్ రాధా. గోదావరి వరదలు రావాలి చూసుకో మరి. చిట్టెమ్మగారు గోదారికన్నా ఎక్కువగా పరవళ్ళు తొక్కేది వీధరుగు మీద కూర్చుని పడవలవాళ్ళనివెళ్ళి గోదారిలో కొట్టుకొచ్చే దుంగలు తెమ్మనేది. ఐదారుగురు తెప్పలు వేసుకెళ్లి పుల్లైడైతే పుల్లతెచ్చి పడేసేవారు పెరట్లో. ఆపటా. వేడివేడి అన్నం ఆవకాయ,పప్పుపులుసూ చేసి వాళ్ళకి సుష్టుగా భోజనం పెట్టేసేది కాని పుచ్చుకునేవారు కాదనుకో.. ఇంక రాధా .. మువ్వొంకాయి అవిడే వండాలనుకో. అమృతం. వీసెల లెక్కనే! కాయలక్కాయలు వండేది. వస్తుందిగా రేపు వండమని అడుగుతా. నీకు తెలీదురాధా. తెలిస్తే అలా హేళనగా చూడవు. ఆవిడే తీసుకొచ్చిందన్నమాట ఈతండాని! ఇంతకీ వీళ్ళంతా ఎందుకొచ్చారన్నావు?"

"ఉద్యోగం వేయిస్తుందిట ఈ కుర్రాడికి వరసన మనవడుటలెండి" అంది రాధ కొంచెం హేళన ధ్వనిస్తూ.

"ఉద్యోగం కాదు పట్టాభిషేకం కూడా చేయించ గల తాహతుంది తెలుసా ఆవిడకి?"

"పోనీలెండి. ఎలాగో అలా నమ్మకం కుదిరింది వీళ్ళమీద. రక్షించారు ఇంటికి పదండి"

"చిట్టెమ్మగా రొచ్చింది కాబట్టి కాని, వాళ్ళ సంగతేమో .. నాకేం నచ్చలేదు. కాపోయినా అంత చొరవ ఏమిటే? పైగా ఆ వేపుడాల పోటీ లేమిటి?"

"బావుంది. ఆయన కంద తినడట. అంగుకని బంగాళా దుంపలు వేయిస్తున్నారు. అయినా కాపోయినా ఎందుకండీ వాళ్లనలా ఆడిపోస్తారు. చిట్టెమ్మగారు గట్టిగా చెప్పి ఉండబట్టి వాళ్లు చనువుగా వచ్చిఉంటారు. కాపోతే మీరు బొట్టెట్టి పిలిచినా నిలువెత్తు ధనం పోసినా వస్తారేమిటి?" అంది రాధ.

"అదే రాధా! అక్కడే నీకూ నాకూ తేడా! నేను మనుష్యుల్నిట్టే చదివేస్తా... అవలిస్తే..."

"మరే మరే వేగులు లెక్కెట్టేస్తారు. మీరు చాలా గొప్పవారు...పదండి" అంది రాధ.

"అలాగే అంటూవుండు. వాళ్లు వెళ్లాక ఏదో పాఠం నేర్చుకుంటావు. అప్పుడో మీరు చెప్పింది నిజంసుమండీ అంటావు అప్పుడు చెప్తానీపని" అన్నాడు గోపాలరావు వెక్కిరిస్తూ.

ముగ్గురూ లేచారు స్వంత ఇంటికి వెళ్లడానికి.

శంకరం రాధ చెంగు పట్టుకులాగాడు నవ్వాపుకుంటూ."ఏవిట్రా. నీ గోలేమిటి?" అంది రాధ.

పకాపక నవ్వేస్తూ వాళ్ల నాన్న కాళ్లు చూపించాడు శంకరం. రాధ కూడా కొడుకుతో కలిసి నవ్వసాగింది.

"ఏమిటా నవ్వులు" అంటూ వెనక్కు తిరిగాడు గోపాలం. భార్యాబిడ్డల దృష్టి తన పాదాలపై కేంద్రీకరించబడి ఉండడం గమనించి, తక్షణం తనూ అదే పనిచేసి తెల్లమొహం వేశాడు — [తెవ్వమన్నాడు.]

ఓ కాలికే బూటు వుంది. రెండో కాలికి లేదు.

తను అంతసేపూ కూర్చున్నచోట చూశాడు. లేదు.

"నేనిలా ఒంటికాలిబూటుతోనే మనింటిదగ్గర్నుంచి వచ్చానా?"అని అతి మెల్లిగా అడిగాడు

"అయితే అప్పుడెందుకు చెప్పలేదు! ఇప్పుడింటికెళ్లడం ఎలాగా?" అన్నాడు గట్టిగా, గబగబా, కోపంగా.

రాధనవ్వడం మానేసింది. కళ్లు నేలకి వాల్చింది. "మీరు మాటలో చనిస్తేగా కొంప మునిగినట్టు ఇక్కడికి పరిగెత్తించారు. అయినా అంత తెలీకపోడం ఏమిటి?" అంటూనే మళ్లీ పకపక నవ్వడం ప్రారంభించిందిరాధ - గోపాలం బూటుకాలు చూసి.

"ఇప్పుడింటికెళ్లడం ఎలాగ?"అన్నాడు గోపాలం.

"బావుంది ఇప్పేయ్యండి"

"ఇప్పేసి నెత్తినపెట్టుకు ఇంటికి మోసుకురానా"

"ఎందుకండీ, ఇది ఇక్కడ పడేసి, అక్కడ దాన్ని ఇక్కడికి తెచ్చి, రెండూ తొడుక్కుని ఇంటికి నడవండి" అంది హేళనగా.

గోపాలం కోపానలం ఇంకా చల్లారలేదు. "అదిమాత్రం ఎలా తెస్తాం.?"అన్నాడు రాధ తెలివితక్కువతనాన్ని చటుక్కున నిరూపిస్తూ.

"రిక్షా పిలవనా నాన్నా" అన్నాడు గోపాలరావు కొడుకు చిరంజీవి శంకరం సమయస్ఫూర్తితో.

"కాదు పల్లకీ మాట్లాడు మా నాన్న బూటుఒకటి మోద్దురుగాని రండి అని."

"అదికాదు నాన్నా. నీ బూటొక్కటే కాదుగా. అమ్మజోళ్లు రెండుమొయ్యొద్దు?"

"ఎందుకు?" అన్నాడు గోపాలం రాధ కాళ్లవంక చూడాలని తట్టనందువల్ల కొడుకు కళ్ళలోకి పరీక్షగా చూస్తూ.

"అమ్మ ఎర్రముఖమల్ జోడు ఓకాలికీ నీల్కైరు జోడు ఓకాలికీ తొడుక్కుంది" అన్నాడు శంకరం వినయంగా.

గోపాలం కసితీరా నవ్వేసి కొడుకుని అమాంతం ఎత్తుకున్నాడు. ఈలోగా ఆశ్చర్యపడడం, కెవ్వుమనడం, కోపం తెచ్చుకోవడం వరుసక్రమంలో పూర్తిచేసిన రాధ పొట్టిగాఉన్న కొడుకు నెత్తిన మొట్టికాయ వేయడానికి కొంచెం వంగబోయింది. అతక్షణానికే గోపాలరావు కొడుకుని, మెచ్చుకోడానికి పైకెత్తినందువల్ల రాధ శ్రమలేకుండా శంకరానికి తేలికగా మొట్టికాయ వేయబోయింది.

శివుడాజ్ఞలేనిదే చీమైనా కుట్టదంటారు. అలాగే మొట్టికాయలు-తేలిక రకం అయినా సరే పడవని కూడా అనొచ్చు. ఎందుకంటే ఉప్పొంగే వాత్సల్యంకొద్దీ కొడుకుని అక్కున అదుముకున్న గోపాలం తల కొడుకు భుజంమీద, కొడుకు తల గోపాలం భుజంమీద ఆన్చబడడం జరిగింది. అందువల్ల సంకల్పం పర్యవసానం వేరయ్యాయి రాధ ఒకటి తలచగా అలవాటు ప్రకారం దైవం ఇంకోటి తలచాడు. కొడుకు నెత్తిమీదకి ఉద్దేశించబడిన రాధమ్మచేతి మొట్టికాయని పైన వివరించిన కారణాలవల్ల గోపాలరావు శిరసావహించడం సంభవించింది.

తన్మయానందంలోఉన్న గోపాలరావు కళ్లు తెరచి రాధవంక చూశాడు. రాధ నాలుక్కరచుకు క్షమాపణ కోరుతున్నట్లుగా సాధేయపూర్వకంగా, తప్పు గ్రహించిన దానిలా చూసి, వలిసపోయిన రంగుచీర వంటి మందహాసం చేసింది.

"అందమైన చేతివేళ్ల మొట్టికాయలు కూడా గట్టిగానె తగులుతాయి" అన్నాడు గోపాలం. * * *

గోపాలరావు ఇంటినించి స్వంతఇంటికి వచ్చి మెల్లిగా లోపలికి ప్రవేశించాడు గోపాలరావు సతీసుత సమేతుడై.

సావిట్లో ఓ పిల్ల మావిడిపండు తింటున్నట్లు అభినయిస్తూ రసం గుంజాతిన వంటికీ గోపాలం ఇంటికీ పులిమేస్తోంది.

గోపాలం ఆగి ఆ పిల్లవంక కొరకర చూశాడు. "బావుంది" అన్నాడు. గంభీరంగా.

"ఏమ్మే" అని ఒక్క కేక పెట్టి ఆపిల్ల పెరట్లోకి పారిపోయింది పోతూపోతూ మామిడి టెంకని గోపాలం తెల్లపాంటుమీద విసిరి చక్కాపోయింది.

పాంటుకన్న ముందుగా రాధవేపు చూశాడు గోపాలం. రాధ నవ్వు ఆపుకుంటున్నట్టు అతనికి బాగా అనుమానం వేసింది. హూఁ అంటూ రాధవంక చూస్తూ తరువాతి అడుగు ఆ టెంకమీదే వేసి జారిపడబోయిన గోపాలం పడకుండా రాధ భుజాలే ఆదుకున్నాయి.

"బాగుంది" అన్నాడు గోపాలం కోపంగా. ఇల్లంతా నాశనం అయిపోతోందని నిర్ధారణ చేసుకున్నాడు. బొమ్మల పుస్తకాలూ, బొమ్మలూ, తలగడాలూ మామిడి టెంకా, దాని తొక్కా చెల్లాచెదరుగా పడిఉన్నాయి. నట్టింట్లో చుట్టాల పెళ్లేటేడా అడ్డదిడ్డంగా సర్దబడివున్నాయి.

"హు" అన్నాడు గోపాలం నట్టింట్లో ప్రవేశిస్తూ.

"ఏమిటా హుహులు......వాళ్లువింటే బాగుండదు" అంది వెనకాలే వస్తున్న రాధ.

"హూ" అన్నాడు రాధ చెంగు పట్టుకు వస్తున్న గార్డు శంకరం.

"నువ్వేమిట్రా మధ్య" అంది రాధ.

"ఆవి డెవరు? ఆ బామ్మగారు? ఈవిడ సంగతి చెప్పలేదేం" అన్నాడు గోపాలం కొంచెం వనక్కి తిరిగి.

"ఇంకే బామ్మగారండి?"

"అదుగో. ఆ గోడవార. చాప మీద కాబోలు. ఉలక్కుండా పలక్కుండా చీకట్లో కూర్చుంది. నిద్రకాబోలుసౌడభ్యం"

ఈసారి రాధ నవ్వు ఆపుకోలేకపోయింది. పొట్ట చేత్తో పట్టుకు విరగబడి నవ్వసాగింది.

ఇంకో సందర్భంలో అయితే రాధ నవ్వినపుడు ఆమె సన్నటి పెదిమలనీ, తెల్లటి పలువరుస తీరునీ, బుగ్గలమీద లీలగా కనపడే సొట్టనీ, నుదురుమీది ముంగురులు సర్దుకునే సన్నటి తెల్లటి వేళ్లనీ, కళ్లకౌటుకని వెక్కిరించే బొట్టునీ, సన్నటి నిచ్చటి మెడని కౌగిలించుకునే నల్లపూసల దండ పక్కన తెల్లగా మెరిసే ముత్యాలదండని గోపాలం వళ్లంతా కళ్లు చేసుకుని చూచి ఆనందించేవాడే.

ప్రస్తుతం అతను ఉక్రోషం పట్టలేకండా ఉన్నాడు.

"నేను 'హు' అని విసుక్కుంటే తప్పొచ్చింది. నువ్వు ఆవిడెవరో ఆ బామ్మగారిని చూసి నవ్వితే ఫరవాలేదుకదూ?" అన్నాడు గోపాలం.

"బామ్మగా రెవరండీ" అంది రాధ నవ్వాపుకుంటూ.

# ★ చుట్టాలొచ్చారు ★

"అదేం. కనబడడం లేదు...ముసుగేసుకుని ముంగిలా కూచుంది. కిటికీలోయ్య కనబడుతుంది"

"అది బామ్మగారు కాదండీ - ఆవకాయ కుండ. పెద్ద వాసిన కట్టిన బాన.... మీ చిట్టెమ్మగారు తెలూకు."

"చాల్లే నవ్వక్కర్లేదు.. పొరపాటు" అని డబాయించబోయిన గోపాలాన్ని కూడా నవ్వాగలేదు. చిరంజీవి శంకర్రావుకి వాళ్ళ ధోరణి నచ్చలేదు. ఇంటినిండా చుట్టాలుండగా ఇలా విరగబడి నవ్వడం బాగులేదు. ఎంతకీ వాళ్లి నవ్వులు ఆగవేం అనుకున్నాడు.

"నాతండే! నో చచ్చిపోను. ఎన్నాళ్ళకి చూశాను గోపన్నా.. చిలాకా గోరింకల్లా ఉన్నారు బాబూ . నీ పెళ్లామా ఏవిటది? బాగుంది. మా లక్ష్మిలా ఉంది" అంది అప్పుడే బండిదిగి సావిట్లోకొచ్చిన చిట్టెమ్మగారు మనసులో ఆనందం అంతా మాటల్లో నింపి ఇల్లంతా వెదజల్లుతూ.

"రండి బామ్మగారు రండిరండి రండి ఏయ్ రాధా. ఒరేయ్ శంకరం. ఇలారండి. బామ్మగారు చూస్తారు" అన్నాడు గోపాలం.

"ఏదమ్మాయీ ఇలా వెలుగులోకి రామ్మా .. నా తల్లీ. మా లక్ష్మి నీకుదొరికింది రా గోపన్నా.. వీడా నీ కొడుకు... అచ్చు నువ్విలా గేఉండేవాడివి చిన్నపుడు ఎటొచ్చీ నలుపనుకో..."

"దానికేంలెండి పరవాలేదు. చిన్నప్పుడేదో..."గోపాలం తటిమని ఆగిపోయాడు రాధ వంక చూసి.

"అవునుగాని బామ్మగారు. అదేంపనండి. సరాసరి ముందు ఇంటికి రాకుండా?" అన్నాడు.

"సరేనాగన్నా.. ఇక్కడికి రాకేంచేస్తాను రా. మీ నాన్న ఎడ్రెసు రాసిచ్చాడు. నేనువచ్చిన పని వేరేఉంది. సరే ముందు అది చక్కపెట్టుకుమరీ వద్దామని అటు వెళ్లాను మా వాళ్ళనిటుపంపి. తీరాచేస్తే ఆ పెద్దమనిషి లేడనుకో."

"ఏమిటో మీరు ముందిక్కడికొచ్చి తరవాత వెళ్లాల్సింది సుమండీ" అన్నాడు గోపాలం.

"నిజమే ఏదో వచ్చినపని చూసుకొచ్చిద్దామని అలా వెళ్ళా" అంది బామ్మగారు... శంకరం జుట్టు నిమురుతూ.

"అయినా రైలుదిగుతూనే పనేమిటండీ. ముందు ఇంటికొస్తారనుకున్నా." అన్నాడు గోపాలం.

"మరే. నేను అదేఅనుకున్నా, బాబూ. కాని వచ్చినపనిచూడు...అందుకని అక్కడే వెళ్లొచ్చిద్దామని..."

"మా ఊళ్ళోదిగితే ముందిక్కడికి వస్తారనుకున్నా సుమండి."

"ఎందుకురాను నాయనా. నీకన్నా నాకెవరు ముఖ్యం. అయితే వచ్చినపని మూలాన"

"అయినా కాపోయినా ఎంత కాని కార్యం అయినా ముందు ఇంటికొచ్చి కాస్త ఎంగిలి పడొద్దండి"

"నిజంబాబూ అయితేనేం. పని చూశావూ."

"అవుననుకోండి .అయినా...."

అవ్వా మనవళ్ల సంవాదానికి అంతెక్కడో తెలియలేదు రాధకి. చెడిపోయిన గ్రామఫోను ప్లేటులా ఒక్కచరణమే తిరిగితిరిగి వల్లిస్తున్నారు ఇద్దరూ.

"మీరు రానందువల్ల వీళ్లెవరో తెలీక కొంచెం..." అంది రాధ తెగించి కలుగచేసుకుని.

విషయం అప్పటికి మారింది.

"వాళ్ళు తెలీకపోడం ఏవిటి గోపన్నా. నీకు గ్యాపకం లేదేమో కాని కిందటి పుష్కరం కాక, ఆ కిందటి పుష్కరాలకి గామోసు ధవళేశ్వరం వచ్చారు నువ్వప్పుడు ఏణ్ణర్థం వాడివనుకో. అమ్మ, మీ బామ్మ, నాన్నా, అంతా బాగా తెలుసు వాళ్లకి. ఆ పెద్దావిడ మా అక్క కూతురు శారద. దాని కూతురు దాని కూతుర్ని బుచ్చిక్కగారు కొడుక్కిచ్చిందన్నమాట." అంది బామ్మగారు.

"రాధ చెప్పిందిలెండి.. రండి నించున్నారేమిటి లోపలికి రండి . నాకసలు మతిఉండదు" అన్నాడు గోపాలం.

"అమ్మలూ దుక్కగిన్నిలో పాలు కాచీ వచ్చునా" అని వంటింట్లోంచి కేక వినబడింది.

రాధా గోపాలం, బామ్మగారు శంకరం భోజనాలకి వెళ్ళారు

రాత్రి గోపాలాన్ని ఓ పక్కనా శంకరాన్ని ఓపక్కనా కూర్చోపెట్టుకుని బామ్మగారు కీలుగుర్రం కథ చెప్పింది.

రాధమ్మ శారదనిదగ్గిరకి తీసింది. ఇద్దరూ పెరట్లో పడుకున్నారు.

కొత్తగా పెళ్ళయిన శారద తెల్లటి వెన్నెల్లో వెల్లకిలా పడుకుని, తన తొలి రోజుల అనుభవాలు మెల్లిగా మెత్తగా చెబుతూంటే, రాధ అనిమిష నేత్రాలతో తన అనుభూతుల తెరలగుండా తెల్లటి చల్లటి వెన్నెలనీ, ఆ వెన్నెల అవతల వెలిగే నీలి మాకాశాన్ని, తన్మయురాలై చూస్తూ, మెల్లిగా నవ్వుకుంటూ, శారద

అనుభవాల కబుర్లు ఉపశ్రుతిగా వింటూ నిద్రపోయింది...

పొద్దునే ఇల్లు హడావుడితో నిండి పోయింది. శారద అత్తగారు, మామగారు, దొడ్డమ్మగారు విసిరిన చెణుకులికి, ఆడిన పరాచికాలకి రాధమ్మ కొత్త పెళ్లికూతురికి మల్లే సిగ్గుపడిపోయింది. మొగుడివంక ధైర్యంగా చూడడానికికూడా సాహసించ లేకపోయింది. గోపాలం అంతకన్న కొత్త పెళ్లికొడుకైపోయాడు. వచ్చినవాళ్ళందరికీ ఎడతెగని మర్యాదచేసేస్తున్నాడు. ఆఫీసుకు సెలవుకూడా పెట్టేశాడు. బద్ధకొన్ని తరిమేసి, కూరలసంచి పట్టుకుని బామ్మగారిని వెంటపెట్టుకుని బజారుకెళ్లి సంభారాలు తెచ్చేశాడు. హోటల్నుంచి ఇడ్డెన్లు కాఫీ తెప్పించేసి శారదకీ ఆపిల్ల మొగుడికీ పిల్లలకీ, ఆ పెద్దాయనికీ స్వయంగా అందిచ్చాడు. ఆయనకి చుట్టలుకూడా తెచ్చిచ్చాడు.

పదిగంటలయేసరికి తెర్లుతున్న పప్పు పులుసు ఘాటుకు ఇరుగిల్లూ పొరుగిల్లూ కూడా ఘుమఘుమలాడిపోయాయి. భోజన కస్తూరి పరిమళం పేర్లేగిపోయింది.

చిట్టెమ్మగారు వనభోజనాలకి వండేటంత ధాటీగా పొత్తుపంచ (పట్టుపంచ) కట్టుకుని అడ్డెడు బియ్యపు గిన్ని అవలీలగా దించి అక్కడ పెట్టేసింది. నవనవలాడే వంకాయలు రెండు వీశెలు కారం కూరి ముప్పంకాయ కూర చేసేసింది. ఆ ముందు సాయంత్రం తన వేపుడు సామర్థ్యం గురించిపొగుడుకుని, బుచ్చికక్కిగారిఅసామర్థ్యాన్ని హేళన చేసిన దొడ్డమ్మగారికి చిట్టెమ్మగారి సామర్థ్యం తెలుసు కాబట్టి ఆవిడ మామూలుగా ఉంది కాని, మిగతా జనాభా అంతా ముక్కుమీద వేలేసుకుని హారా బామ్మగారూ! అని ఆశ్చర్యపోయారు.

వంటింట్లోంచి గోపాలం సావిట్లోకి వచ్చాడు. శారద మావగారు( ఆయన పేరు గోపాలం అడిగి తెలుసుకోలేదు) గోపాలం పుస్తకాల బీరువాని అల్లకల్లోలం చేసేస్తున్నాడు ఒకపక్క. ఇంకోపక్క ఆయన కుమార రత్నం గోపాలం టై కట్టుకుని కోటు తొడుక్కుని అద్దంలో చూసుకుంటున్నాడు. నిన్న తనమీద మామిడి టెంక విసిరిపోయిన తాటకి ఒక మూల కూర్చుని గోపాలం కొడుకు శంకర్రావు బొమ్మల్ని విరగ్గొట్టడానికి ప్రయత్నిస్తోంది శ్రద్ధగా. శంకరం విలాసంగా చూస్తున్నాడు. "మా నాన్న మళ్ళీ కొంటాడులే" అన్న ధీమా వాడి చిరునవ్వులో గోపాలానికి కనబడింది.

"లాభం లేదు. జాగ్రత్తపడాలి మనసా" అనుకున్నాడు గోపాలం పెదవి విరచి.

అతను అదివరకు పుస్తకాల్లో చదివిన పురానా దోపిడీ కథలు, అక్కడక్కడా విన్న దోపిడీ సందర్భాలూ మననం చేసుకున్నాడు.

నిశ్శబ్దంగా వెనక్కెళ్ళిపోయి రాధని పిలుచుకొచ్చి చూపించాడు. "హు" అన్నాడు. "చూసుకో నేను చెప్పింది నిజమవునో కాదో చూసుకో" అన్న ధోరణిలో.

రాధ నిర్లక్ష్యంగా నవ్వింది. "ఈమాత్రానికే వాళ్లని దొంగలంటారా. అయ్యో తెలివా!" అన్న అర్థం స్ఫురించేవిధంగా.

"ఇంతకన్న ఏంకావాలి. కనబడటం లేదు? ఆయన పుస్తకాలు కొన్ని ఓపక్కన తీసి జాగ్రత్తపడడం - ఆ కుర్రాడు నా సూటు టై వేసేసుకుని కులకడం - ఆ తాటకి మన పిల్లాడి బొమ్మలూ పుస్తకాలూ పనిగట్టుకు నాశనం చెయడం. కనబడటం లేదు?" అన్నాయి గోపాలం కళ్లు.

"పోరుదూ మీరన్నిటికీ ఇంతే. నాకేం అందులో తప్పు కనబడలేదు. ఇందులో భయానికేం ఆస్కారం లేదు" అన్నాయి రాధమ్మ అరమోడ్పు కళ్లూ, కొనతేలీ, నిర్లక్ష్యాన్ని ద్యోతకపరచే ముక్కూ కలిసి.

"చెబితే వినకపోతే చెడితే చూడమన్నారు. ఇంతకన్నా నేనేం చేస్తాను?" అన్నాయి గోపాలం పెదిమ విరుపూ, అమెరికా కథానాయకులవలె ఎగరేసిన భుజ ద్వయమూ.

శారద మామగారు ఈ దంపతులను చూశాడు. "రావోయ్ గోపాలం రా. నుంచుంటావేం కూర్చో" అన్నాడు.

"అబ్బే పనుందండి. అలా వెళ్ళొస్తే ఇప్పుడే." అనేశాడు గోపాలం ఏం తోచక.

"ఎక్కడికి" అని రాధమ్మ కళ్లు ఆశ్చర్యపోతూ ప్రశ్నించాయి.

"నా యిష్టంవచ్చిన చోటికి. ఈ ఇంట్లో నామాట విననివాళ్లకి నేను చెప్పడం ఎందుకు?"అంది చరచరవెళ్లి గుమ్మం దాటుతున్న గోపాలరావు కోటు.

* * *

సరాసరి కాఫీహోటలికి వెళ్లిపోయాడు ఎక్కడికి వెళ్ళాలో ఆలోచించదలచుకున్న గోపాలరావు.

"పని లేకపోతే నాతో రారాదు

# ★ సిఫార్సు ★

"ఓయ్! గోపాలం! చిన్న రాచకార్యం చక్కపెట్టాలి." అన్నాడు కిళ్ళీకొట్టుదగ్గిర కనబడిన స్నేహితుడు. అతనిపేరు అప్పారావు. వయసు 28. వృత్తి సిగరెట్లు కాల్చడం. ఆస్తి బోలెడు ప్లస్ ఒక కారు. సరదాలు అమ్మాయిలని ప్రేమించడం. సద్గుణాలు పుష్కలం. దుర్గుణాలు: చూడుడు అభిప్రాయములు: అభిరుచులు: ఆత్మస్తుతి, పరుల ప్రశంసలందుకోడం. అభిప్రాయాలు: లోకంలో సర్వజ్ఞులుపదారాగురు. అందులో తను ఒకడో, ఇద్దరో. దుర్గుణాలు మచ్చుకోసం వెతికినా కనపడే అవకాశంలేదు. సైడు హాబీలు: ఉద్యోగాలు లేనివాళ్ళకి వేయించడం, ఉన్నవాళ్ళవి తీసేయించడం దైనందినీయం: పోట్లాటలు తేవడం, పరిష్కరించడం. మాటల రవాణా.

"ఎక్కడికి?" అన్నాడు గోపాలరావు.

"ఇక్కడే ఓ ఇంజనీరుగాడింటికి. మావాడొకడికి ఉద్యోగం వేయిద్దామని." అన్నాడు అప్పారావు.

"ఐతే నేనెందుకు మధ్య."

"చూద్దుగాని నా తడాఖా. ఇదివరకటి ఇంజనీరుగాడు నా చేతుల్లో కీలుబొమ్మ లే. వీడు కొత్తవాడు - కుర్రాడుట. లంచాలు పుచ్చుకోడని విన్నాను. పాతవాడయితే వందరూపాయల ఉద్యోగం ఇస్తే మామూలుగా మూడు నెలలపాటు ఆశ్రయించినవాడి జీతం తీసుకునేవాడు...వీడికిమాత్రం ఆశ్రయించేవాడికి చదువు రావడం, బుద్ధిమంతుడుగా ఉండడం ముఖ్యంట. సిఫార్సు లేకపోయినా చాలమందికి ఉద్యోగాలు వేశాడుట. మావాడు అడ్డగాడిద అనుకో. అయితే నేం నేను మాట్లాడివేయిస్తా" అన్నాడు అప్పారావు ధీమాగా.

"నీకు తెలుసా?"

"కొద్దిగా..." అన్నాడు అప్పారావు కారుడ్రైవుచేస్తూ. శారద మొగుడికి చిట్టెమ్మగారు ఉద్యోగం వేయించేదికూడా ఈ ఇంజనీరు దగ్గిరే కాదుకదా కొంపతీసి!" అనుకున్నాడు గోపాలం.

* * *

పన్నెండు గంటలయింది. ఇంజనీరుగారు ఇంట్లో గోపాలం సమక్షాన అప్పారావు శత విధాల పలుకుబడి వినియోగిస్తున్నాడు. ఇంజనీరుగారికి 35 ఏళ్ళకన్న ఉండవు. పచ్చగా పుష్టిగా ఉన్నాడు. కళైన ముఖం. పొడగరి.

"అయినా అడ్డగాడిదలకి ఉద్యోగం ఎలా ఇవ్వనండి! మీరే చెబుతూంటిరి మీవాడు అడ్డగాడిద అని." అన్నాడాయన అప్పారావు సోది విని విని విసుగెత్తి.

"నిజమేననుకోండి" అన్నాడు అప్పారావు.

"ముమ్మాటికీ నిజం...నాకు తెల



వైద్యశాల

చిత్రకారుడు: పి. కె. ప్రభాకర్.

# ★ చుట్టాలొచ్చారు ★

విప్పించండి. భోంచెయ్యాలి" అన్నాడాయన కొస్త చిరాకుగా.

గోపాలానికి మనసు చివుక్కుమంది ఆయన ఎంతమంచివాడైనా ఇంటికొచ్చిన వాళ్ళని వెళ్లమంటున్నందుకు.

"ఇంజనీరు బాబూ! ఉన్నారా!" అంది సుపరిచిత స్వరం.

"ఎవరండి" అంటూ ఇంజనీరుగారు ఆఫీగదిలోంచి లేచి సావిట్లోకి వెళ్ళాడు.

గోపాలం కొంచెంవంగిచూశాడు.

చిట్టెమ్మగారు నెత్తిమీద ఆవకాయ కుండ, కుడిచేతిలో టిఫినుకారేజి పట్టుకుని నిండుగా నవ్వుతూనించుంది.

"ఎవరమ్మా" అన్నాడు ఇంజనీరుగారు.

"నేను బాబూ చిట్టెమ్మని నువ్వెరగవు కాని మీనాన్నావాళ్ళూ మా పొరుగింట్లో ఉండేవారు ఇదివరకు. ఏం గొప్పహృదయమని! ఆయనది." అందావిడ.

"అయ్యో నెత్తిమీద బరువుతో నించున్నారే. ఉండండి సాయంపడతా దింపండి" అంటూ నెత్తిమీద బాన దించారు ఇంజనీరుగారు.

"ఇదంతాఏమిటంటే మీఅమ్మ సోంపేటనించి ఉత్తరంరాసింది బాబూ నీకు ఆవకాయంటే ఇష్టమని. ఏదో కొద్దిగా పెట్టి తిరపతి వెళ్తూ, ఇక్కడ దిగి తెచ్చాను. చూడు బాబూ. ఇదు గో ముద్దంకాయ కూర కూడాను. లోపలికి పద భోంచేద్దు గాని ముందు. మనవ రాలేదీ!...మా లక్ష్మి...."

ఇంక మాటలు వినబడలేదు. ఇరవై నిముషాలదాకా. అప్పారావు వెళ్లిపోయినా గోపాలం కూర్చున్నాడు చిట్టెమ్మగారి కోసం అని.

భోజనాలై సావిట్లో కొచ్చారు. "చిట్టెమ్మగారూ! జన్మలో ఇంత రుచి అయిన కూర తినెరగనుసుమండి. ఆవకాయ అమోఘంగా వుంది లెండి. మా అమ్మ చెప్పడం, మీరు తేవడం, కాపోయినా కబురంపకపోయారటండీ బండ్రోతును పంపుదును" అన్నాడు ఇంజనీరుగారు.

"అయ్యో మడిగట్టుకు వేసిన ఆవకాయ బండ్రోతుచేత ఎలా మోయిస్తాం బాబూ. అయినా తప్పేముందిలే" అంది బామ్మగారు.

"సరే. ఇంత మిట్టమధ్యాహ్నం ఎండలో మా యింటికొచ్చి, భోంచేయకుండా వెళ్ళడం భావ్యంకాదు బామ్మగారూ అంది" ఇంజనీరుగారి సన్నటిభార్య సన్నని గొంతుతో.

"బామ్మగారు ఇవాళ మీరు మాయింట్లో ఎంగిలి పడకపోతే నామీద ఒట్టే."

"కావలస్తే మళ్లీ మడిగట్టుకు ఒండుతాను. మీలాంటివారు మా యింటికి రమ్మంటే వస్తారా! మళ్లా మళ్లా" అంది ఇంజనీరుగారి భార్య.

గోపాలానికి ఆనందంతో ఒళ్లు పులకరించింది. చిట్టెమ్మగారికి జరుగుతున్న గౌరవానికి.

"మీరు భోంచెయ్యక తప్పదు" అన్నాడు ఇంజనీరుగారు.

"ఇంజనీరుబాబూ..." అంది చిట్టెమ్మగారు గంభీరంగా. ఇవతలగదిలో గోపాలం చెవులురిక్కించుకు వింటున్నాడు. "ఇంజనీరుబాబు! నేను నిన్ను అడిగేది ఈపూటకి భిక్షకాదు. శాశ్వతభిక్ష. నా చెల్లెలు అల్లుడికి సర్కారులో ఉద్యోగం వేయించు నాఘటం మహారాజులా వెళ్లిపోతుంది. నాకేం బెంగలేదుకాని నాచెల్లెలికున్నదల్లా ఒక్కగా నొక్కబిడ్డ. దాన్ని ఆ అయ్య చేతులో పెట్టింది. అతగాడే వాళ్లని గట్టెక్కించాలి. వాడైనా బుద్ధిమంతుడు. యోగ్యుడు. మెట్రిక్లేషన్ పరీక్ష ఇచ్చాడు. మావూళ్లోనే ఉద్యోగం కాళీ అయిందిట. నువ్వేఇవ్వాలిట. అందుకని ఆ ఉద్యోగభిక్ష పెట్టు ఇంజనీరుబాబూ" అంది చెంగుపట్టి.

రెండుక్షణాలు నిశ్శబ్దం ప్రవర్తిల్లింది. గోపాలం నరాలుగ్గబట్టి కూర్చున్నాడు.

"అలాగే చిట్టెమ్మగారూ. ఆనక అబ్బాయినోసారి పంపించండి. మాట్లాడి .."

"నీఇల్లు వెయ్యిళ్లు మొదలై ... నా తండి నాతండి...ఒస్తా బాబూ" అంది చిట్టెమ్మగారు.

*　　　*　　　*

ఆ సాయంకాలమే చిట్టెమ్మగారు, చెల్లెలూ, పిల్లలూ అంతా తిరుపతి బయలుదేరి వెళ్లిపోయారు గోపాలాన్ని, రాధని, శంకరాన్నీ శతవిధాల ఆశీర్వదించి.

"రాధా నువు చాలా తెలివైనదానివి. మనుషులశక్తి మంచితనంలో గొప్పతనం కొద్దిగా చిట్టెమ్మగారు చూపించింది. నాకు అంచనాలు కట్టడం అట్టేబాగా రాదు" అన్నాడు ఆరాత్రి నిద్ర కుపక్రమించిన గోపాలం.

రాధ మెత్తగా నవ్వింది. "చిట్టెమ్మగారేవిటి... వాళ్లుకూడాఎంతమంచివాళ్లని..." అంది.

గోపాలానికి పూర్తిగా నమ్మకం కుదరలేదు శారద మావగారిమీద. "మరే మరే" అన్నాడు ముక్తసరిగా.

మర్నాడు పొద్దున్నే కాఫీ పొడుండబ్బా కాళీ అయిన వైనం గుర్తించబడింది. అటు మొన్ననే తేవలసింది. నిన్న మొన్నటి హడావిడిలో మర్చిపోవడం జరిగిందన్న సంగతికూడా గ్రహించబడింది.

"మరచెంబుతే హోటల్నించి కాఫి తెస్తా" అన్నాడు గోపాలం చొక్కా వేసుకుంటూ.

మరచెంబు ఎంత వెతికినా కనపడలేదు.

"చూశావా...హూఁ. నేను చెబితే నమ్మేవా. నాకు తెలుసు" అన్నాడు గోపాలం విజయగర్వంతో.

రాధ మాట్లాడలేదు. తల వంచుకుని జర్మన్ సిల్వర్‌గిన్నె ఇచ్చింది కాఫీ తేవడానికి.

కాఫితాగి మళ్లా ప్రస్తావించాడు.

"పోనీలెండి. మాబామ్మ పెళ్లినాటి చెంబది. సొట్టలుకూడా పడింది. పొరపాటున పటికెళ్లుంటారు." అంది రాధ.

"అదే నేనూ అనేది ఘరానా పొరపాట్లంటే ఇవే" అన్నాడు గోపాలం.

భోంచేసి, ఆఫీసుకు బయల్దేరేముందు సిగరెట్టు అంటించి పడకకుర్చీలో విశ్రమించాడు.

ఎదురుగుండా నట్టింట్లో కావడిపెట్టికింద ఏదో మెరుస్తున్నట్లు కనబడింది. పక్కనేకూర్చుని తమలపాకులు వేసుకుంటున్న రాధకూడా అది గమనించింది. చటుక్కునవెళ్లి మెరుస్తున్న సరుకుని బయటికి తీసింది.

"ఏమిటది?" అన్నాడు గోపాలం రాధ ఆసరుకుని చెంగుచాటున దాచుకోడం చూసి.

"అబ్బే. ఏంలేదు. మరచెంబు ఇత్తడిది కాదులెండి కంచుది. పాతది కాదులెండి. కొత్తది. మనది కాదులెండి. మన చుట్టాలది. ఇది దొంగతనం కాదులెండి. పొరపాటు" అందిరాధ ★




**వనితాలోకం:**

# ఈజిప్టు మహిళల స్వాతంత్ర్య సమరము

## ఇల్లిందల సరస్వతీదేవి

భారతదేశ స్వాతంత్ర్య సమరములో ఏ అస్త్రాలను ప్రయోగించి మహాత్ముడు విజయముసాధించాడో, ఆయన ఉపదేశము పొందిన మదామ్ డోరియా షఫిక్ ఆ అస్త్రాలనే ప్రయోగించి ఈజిప్టుదేశములో స్త్రీ స్వాతంత్ర్యాన్ని సంపాదించింది.

స్త్రీ స్వాతంత్ర్యోద్యమములో భారతీయ వనితలకంటె ఈజిప్టు మహిళలు అధికముగా కష్టపడవలసివచ్చినది. భారతీయ వనితలకంటె నిస్సహాయమైనస్థితిలో ఆ స్త్రీలు సమరము ప్రారంభించారు. భారతీయ వనితలకు దేశస్వాతంత్ర్యముతో రాజకీయ జాతీయ స్వత్వములు లభించాయి. పురుషులు దానికవరోధాలను కల్పించలేదు. ఈజిప్టులో మతము సంప్రదాయాలు బలవత్తరములు కాగా పురుషులు స్త్రీ స్వాతంత్ర్యాన్ని నిరోధించారు.

టర్కీ భారతదేశాలలో స్త్రీలకు ఒక్క కలము గీటుతో అన్నిస్వత్వాలు లభించాయి కాని ఈజిప్టు వనితల కాభాగ్యము లేదు. ఈజిప్టులో నూటికి 91 మంది ఇస్లాము మతస్థులు. స్వాతంత్ర్యము మతానికి వ్యతిరిక్తమని భావించేవారు. అందుచేత ప్రతి చిన్నవిషయానికీ ఆ దేశపుస్త్రీలు కొంత ఆందోళన పోరాటము సలుపవలసివచ్చినది.

సుమారు పాతికసంవత్సరాల క్రిందట ఈజిప్టులో స్త్రీ స్వాతంత్ర్య సమరము ప్రారంభమయింది. ఈ శతాబ్దారంభము నాటికి ఆ దేశపుస్త్రీలు నిరక్షరాస్యలు. అంతఃపురాలలోనే వారి విహారాలు. హక్కుల విషయము తెలియదు సరికదా విని అయినా ఉండలేదు. బహుభార్యాత్వాన్ని స్త్రీలే ఆమోదించేవారు. సపత్నులు సఖులమాదిరిగా మెలగుతూ ఉండటమే ఆదర్శమూ సహజమూ అనుకునేవారు. 1910 లో షేక్ మహమ్మద్ అబూ ఇస్లాము మతములో స్త్రీ స్వాతంత్ర్యాన్ని నిరోధించే అంశాలు ఏమీలేవని వెల్లడించాడు. ఆయన గొప్పసంస్కర్త. దీనితో జాతికంతకూ కనువిప్పయినది. 1919 లో స్త్రీలందరూ కలిసి మేలిముసుగులతో మగవారి అనుజ్ఞను పొందకుండా, తమకు జరుగుతున్న అన్యాయాలను నిరసిస్తూ వీధులలో ఊరేగింపును సాగించారు. 1923 లో హుదాషెరాలి అనే స్త్రీ మొట్టమొదటసారి పరదాలను తొలగించుకొని స్వేచ్ఛగా వీధులలో నడవటానికి ముందడుగువేసింది. కొందరు స్త్రీలు ఆమెను అనుసరించారు. కాని లోకులు పరిహసించటము అగౌరవముగా చూడటమూ మానలేదు.

స్త్రీలు తలచుకుంటే చేయలేని పని ఉన్నదా?

క్రమముగా స్త్రీలలో విద్య నేర్వవలెనన్న వాంఛ ప్రబలమవుతూ వచ్చింది. స్త్రీలు బాలికలు పాఠశాలలకు వెళ్ళటానికి మొదలుపెట్టారు. 1935 లో ఒక స్త్రీ ఉద్యోగానికి ప్రయత్నాలు అనేకంగా చేసింది. కాని స్త్రీలకు ఉద్యోగాలిచ్చే పద్ధతి ఆకాలములో లేదు. అందుకు పురుషులందరూ వ్యతిరేకులే. అప్పటినుండీ స్త్రీలలో స్వాతంత్ర్యబీజాలు బాగా నాటుకొని ఎదగనారంభించాయి. 'స్వత్వాలు' 'హక్కులు' 'స్వాతంత్ర్యము' ఎవరినోట

# ఈజిప్టుమహిళల స్వాతంత్ర్య సమరము

విన్నా ఈ మాటలే! స్త్రీలందరూ నడుములు కట్టుకున్నారు—సమావేశాలు తీర్మానాలు, నినాదాలు, ఊరేగింపులు సాగించారు. సమరము జోరుగా సాగింది. 1940 నాటికి స్త్రీ విద్య తృప్తికరముగా అభివృద్ధి చెందింది. స్త్రీలలో వైద్యురాండ్రు, న్యాయవాదినులు, ప్రొఫెసర్లు, రచయితలు బయలుదేరారు. స్త్రీల మనోనిశ్చయము దట్టానికి బదులుగా పనిచేస్తుందని చాటారు. క్రింది తరగతులవారు కర్మాగారాలలోను వ్యవసాయపు పనులలోను ప్రవేశించారు. జాత్యభ్యుదయానికి అప్పటివరకు ఆదేశపు స్త్రీలు ఎంతో కష్టపడినా రాజకీయముగా హక్కులు లభించలేదు. గృహనిర్వహణముతో పాటు ఉద్యోగములను కూడా సాధించిన స్త్రీలు అనేకులు బయలుదేరారు. 'రాజకీయ స్వత్వములు మా జన్మహక్కులు' అంటూ.

కేవలము స్వాతంత్ర్యపిపాసే కాకుండా సంఘశ్రేయస్సుకొరకు కూడా తాము పాటుపడగలమని ఆ వనితలు లోకానికి చాటదలచుకొన్నారు. 1944 లో కలరావ్యాధితో దేశమంతా అట్టుడికినట్లయినది. ఆ సమయములో స్త్రీలు బయలుదేరారు ఒక్కొక్కరే—అంతకుపూర్వము గృహప్రాంగణము దాటనివారందరూ సంఘ సేవికలయి అదనుకు ప్రభుత్వాన్ని ఆదుకున్నారు. పేద రోగులను ప్రభుత్వమువారి కార్లలో వైద్యాలయాలకు చేర్చారు; ఇండ్లలో ఉన్న వారికి వైద్య సౌకర్యాలను కల్పించారు. ఒక్కొక్క గృహాన్ని శుభ్రపరచటానికి పూనుకొన్నారు. తత్ఫలితముగా ఆ అంటు జాడ్యము వెంటనే అణగిపోయింది అప్పుడు తెలిసివచ్చింది ప్రజలకూ ప్రభుత్వానికీ స్త్రీలుకూడా మనోనిబ్బరముతో ఎటువంటి త్యాగమయినా చేసి కార్యముసాధించగలరని.

1948 నాటికి ఈజిప్టుస్త్రీలు సాంఘికముగా ఆర్థికముగా సాంస్కృతికముగా హక్కులను సాధించి పురోగమించగలిగారు కాని రాజకీయస్వత్వాలు మాత్రము చేజిక్కలేదు. స్త్రీలందరు పార్లమెంటు ప్రవేశాధికారము కొరకు ఆందోళన సలిపారు

మదామ్ డోరియా షాఫిక్ సాహిత్యములో డాక్టరు పట్టము పొందిన విదుషీమణి. నాలుగు మాసపత్రికలకు సంపాదకురాలు. నిరక్షరాస్యతా నిర్మూలనకై అనేక పాఠశాలలను నిర్వహిస్తూ అనేక రంగాలలో సంఘసేవచేస్తున్న కార్యకర్త్రిణి. ధైర్యముతో స్వార్థరహితముగా పనిచేయు దేశసేవిక. త్యాగము లేనిదే దేశానికి గాని స్త్రీలకుగాని స్వాతంత్ర్యము లభించదని ఆమె మనసారనమ్మింది. 'డాటర్స్ ఆఫ్ ది నైల్' అనే ఈజిప్టు మహిళా మండలికి ఈమె అధ్యక్షురాలు. ఆమె చేతనే ఆ మండలి స్థాపించబడ్డది. స్త్రీలదుస్థితినిగురించి తన పత్రికలలో ఆమె విరివిగా వ్రాస్తూ ఉండేది. ఆ దేశపు స్త్రీల సమస్యలు బహుభార్యాత్వము, బహు సులభముగా పురుషులు ఇచ్చే విడాకులకు సంబంధించినవే ఎక్కువగా ఉండేవి "శాసనము తప్ప మరొకటి దానిని ఆపలేదు" అని ఆ "స్త్రీలందరూ నిశ్చయించుకొన్నారు. వెంటనే "స్త్రీలే స్త్రీల కష్టసుఖములను అర్థము చేసుకోగలరు. కనుక పార్లమెంటులో స్త్రీలే స్త్రీలకు ప్రాతినిధ్యము వహించాలి" అని పత్రికలలో ప్రచారము చేశారు; సభలలో చర్చించి తీర్మానాలను చేశారు; ప్రభుత్వాన్ని ఒత్తిడిచేశారు. ఈ పోరాటము మూడు సంవత్సరాలపాటు హోరాహోరిగా నడచింది, కాని సఫలము కాలేదు. మదామ్ డోరియా షాఫిక్, ప్రాణము విసిగి చివరకు పార్లమెంటును సాధించటానికి పూనుకొన్నది.

శాసనసభా భవనపరిసరాలలో కొన్ని వేల మంది స్త్రీలు సమావేశమయి మహాసభ నొకదానిని జరిపారు. జర్నలిస్టులైన పురుషులు ఆ సభకు హాజరయినారు. సభ్యురాండ్రవద్ద కత్తులు కాని కటార్లుగాని లేవు. భవనబహిః ప్రదేశమున స్త్రీలు చేసిన నినాదాలకు, వేసిన కేకలకు శాసనసభ్యులు విసిగి, మదామ్ షాఫిక్‌ను మరి ముగ్గురు స్త్రీ రచయితలను (జర్నలిస్టులు) శాసనసభా భవనములోకి రానిచ్చి స్త్రీలసమస్యలను విచారించటానికి సమ్మతించారు. కాని ఆకాలపు ఈజిప్టుదేశపు ప్రభువు 'ఫారూక్' తన వాగ్దానమును చెల్లించలేదు; స్త్రీలు పడిన శ్రమకు తగిన ఫలము కలుగలేదు.

మదామ్ డోరియాషాఫిక్ అంతటితో నిరాశచెందలేదు, స్త్రీ స్వాతంత్ర్య సమరము అంతటితో సమాప్తి కాలేదు. మరికొంతకాలము పోరాటము సాగింది. ఈకాలములో మదామ్ షాఫిక్ మహాత్మాగాంధి గారి జీవితచరిత్రను చదవటము తటస్థించింది. ఆయన అహింసాత్మక సిద్ధాంతాలపై ఆమెకు గురికుదిరింది. 1954 మార్చి నెలలో కైరో అలగ్జాండ్రియా పట్టణాలలో మొత్తము 15 మంది స్త్రీలతో మదామ్ షాఫిక్ నిరసనవ్రతము ప్రారంభించింది ప్రెస్సుక్లబ్బులో ఎనిమిది దినాలు మంచినీళ్లు నిమ్మకాయ రసముతో కలిపి ఉపవాసాలను చేసింది. పరిస్థితి ప్రమాదకరముగా ఉన్నదని వైద్యులు సలహాయిచ్చారు ఆమె లక్ష్యము చేయలేదు; తన సంతానాన్ని గురించీ వారి భవిష్యమును గురించీ ఆలోచించలేదు; పట్టుదలతో నిరసన వ్రతాన్ని కొనసాగించింది. ఆ సమయాన ప్రభుత్వము స్త్రీలకు సంపూర్ణ రాజకీయ స్వత్వములను ఇవ్వటానికి సమ్మతించింది. ప్రపంచమంతా ఆమెకృషి ఫలవంతమైనదని ఆనందించింది; ఈజిప్టు స్త్రీలను అభినందించింది.

"మహాత్మాగాంధి చెప్పినట్లు త్యాగము సేవ లేనిదే స్వాతంత్ర్యము సిద్ధించదని నేను అనుభవపూర్వకముగా తెలిసికొన్నాను. స్త్రీలకు స్వాతంత్ర్యములేనిదే దేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించదు" అని మదామ్ షాఫిక్ అంటుంది. ఈనాడు ఈజిప్టుదేశపు స్త్రీలు అన్ని జాతుల స్త్రీలతో పాటు స్వత్వములను అనుభవిస్తున్నారు. అణ్వస్త్రాన్ని కనిపెట్టటము మానవ నాగరికతకు ఎంత ఘనవిజయమో స్త్రీలకు స్వాతంత్ర్యము సిద్ధించటము అంతటి మహావిజయము. అయితే మొదటిది ప్రపంచనాగరికతా వినాశనానికి దారితీస్తుంది రెండవది జాతులన్నిటిని ఐక్యపరచి క్షేమును శాంతిని పెంపొందిస్తుంది

★

# నళిని

## కంచి వాసుదేవరావు

"అమ్మా! ఇందిర పెళ్ళి పిలుపుకు వచ్చింది. పెళ్ళికూతురుకీ తోడి పెళ్ళికూతురికీ కాఫీ టిఫిన్ తీసుకురా" అంది నళిని. లక్ష్మమ్మగారు ముంగిటికివచ్చి "అమ్మో! అమ్మో! స్వయంగా పెళ్ళికూతురే పిలవడానికి వచ్చిందే!...అబ్బాయి దేవూరమ్మా, ఎంతకట్నమంటూ" "అమాయకముగా అడిగింది. "ఆయనిది రాజమండ్రిట. యంకామ్ ప్యాసయ్యాడుట. పైచదువులకి యింగ్లండు వెళ్తాడుట. ఇంగ్లండు నుంచి రాగానే అతనికి అయిదువందల రూపాయలకు తక్కువకాని వుద్యోగము దొరకుతుందిట.... అప్పుడు యిక యిందిర మనతో మాట్లాడదుట."...అంది నళిని నవ్వుతూ! ... "చాల్లే సెర్చుకుపోయావు నీకూ దొరకుతుందిలే!"అంది ఇందిర. ఆనవ్వుతో తనూ కలుస్తూ! ... "అంత అదృష్టమాతల్లీ! ... యింతకీ కట్నమెంతమ్మా!..." అంది లక్ష్మమ్మగారు... "మాబావగారు చాలాఅభ్యుదయవాదిట... ఆయనకి కట్నకానుకలు అక్కర్లేదుట కానీ,..." "చాల్లేవూరుకో! జానకీయింక! ..."అంది కోపంగా యిందిర. జానకి పకపక నవ్వుతూ "అప్పుడే అంతవులుకు వస్తావేం ఇందిరా! అదికాదండీ! ఆయనకి యింగ్లండులో పైచదువులకి అయ్యేఖర్చు భరించాలిట." అంది... "ఏమయితేనేం అమ్మా! అదృష్టము..."అంది లక్ష్మమ్మగారు మళ్ళా దిగులుగా..."అదృష్టమే! మా నాన్నగారు తనఅల్లుడికి కనీసము ఓ యం ఏ డిగ్రీ, మంచి భవిష్యత్తుకావాలి అనుకున్నారు ... అటువంటివాడికోసము మా అక్క మూడేళ్ళనుంచి కలలు కంటోంది ...యివన్నీ యీనాటికి నెరవేరాయి." అంది జానకి.

"నావంతు అయిపోయిందిగా. యిక నువ్వు ప్రారంభించు కలలు కనడము" అంది యిందిర కృత్రిమకోపాన్ని అభినయిస్తూ! ..."అయ్యో! మాటలసందడిలో మర్చిపోయాను. వుండండమ్మా కాఫీ తెస్తాను." అంటూ లక్ష్మమ్మగారు లోపలికి వెళ్ళింది.

కాసేపటికి నళినితండ్రి రంగనాధముగారు వచ్చారు. ఆయననికూడ పెళ్ళికి తప్పక రమ్మని ఆహ్వానించి లక్ష్మమ్మగారితో మరీ మరీ రమ్మనిచెప్పి..."నళినీ! నువ్వు లేకపోతే పెళ్ళిజరగదని" నళినితో చెప్పి వాళ్ళు వెళ్ళిపోయారు.

"అందరి పెళ్ళిళ్లు అయిపోతున్నాయి. మన అమ్మాయికితప్ప. ఎందుకువచ్చిన చదువు!" ... అని లక్ష్మమ్మగారు నిట్టూర్చారు. "దానికీఅవుతుంది!... యింతకీ ఘడియ రావాలి. ... అంతేకాదుతల్లీ అంటూ రంగనాధముగారు ధైర్యముతెచ్చుకుంటూ అన్నారు.

నళినికింకా పెళ్ళికాలేదని రంగనాధముగారికీ లక్ష్మమ్మగారికీ బెంగ! ... కాకపోతే లక్ష్మమ్మగారు ప్రతిరోజూ బయటపడుతుంది. ఆయన బయటపడడు. అంతేతేడా!... ఆమాటకొస్తే నళినికి మటుకు తన పెళ్ళిగురించి ఆత్రుతలేదూ!... తనకష్టసుఖాలని తనజీవితాన్ని పంచుకునే భాగస్వామి రావాలనిలేదూ! ... వుంది! కాని ఎప్పుడూ! ఎల్లా!... నళిని తనజీవితములో కొన్ని ఆదర్శాలు ఏర్పర్చుకుంది. ఆ ఆదర్శాలని గౌరవించగలిగేవ్యక్తి వచ్చేవరకు తనకీ నిరీక్షణతప్పదు.

* * *

నళిని అందరివంటి స్త్రీ కాదు. అందరికీ లభించని అదృష్టాలు అవకాశాలు ఆమెకి లభించాయి. అందులో ముఖ్యమయినది రంగనాధముగారివంటి తండ్రిని గలిగివుండడము.

రంగనాధముగారు వీరేశలింగముగారి శిష్యకోటిలో చేరినవాడు. ఆయనకి స్త్రీ స్వాతంత్ర్యముగురించి స్త్రీ విద్యగురించి సమాజములో స్త్రీ స్థానముగురించి స్థిరమయిన అభిప్రాయాలున్నాయి. ఆ అభి

# ★ నళిని ★

ప్రాయాలనే పుణికిపుచ్చుకుంది నళిని. కాని యీ విషయములో లక్ష్మమ్మగారి అభిప్రాయాలుమటుకు వేరుగా వుండేవి. "ఆడదానికి చదువు దేనికీ!... ఒకఅయ్య చేతిలో పెడితే మనబరువు వదలుతుంది. వీళ్లంతా వుద్యోగాలు చేయాలా వుళ్లేలాలా" అనేది ఆవిడ... "కనీసము దానికి లోకజ్ఞానం వచ్చేటంతవరకు అంటే ఎస్.ఎస్.ఎల్.సి. వరకయినా చదువుచెప్పిస్తాను. తర్వాత పెళ్లి సంగతి" అనేవారు రంగనాధముగారు.

నళిని ఎస్.ఎస్.ఎల్.సి. పూర్తిచేసింది. "యింకయినా, పెళ్లిచేయండి..." అనేది లక్ష్మమ్మగారు. "అది ఎస్.ఎస్.ఎల్.సి. పూర్తిచేసింది దాని అభిరుచులు ఏమిటో తెలుసుకోనీ యింకా చదువుకుంటుందో పెళ్లి చెసుకుంటుందో" అనేవారు రంగనాధముగారు... దాన్ని కనుక్కోవడమేమిటండీ!... దానికేం తెలుసు" అనేది లక్ష్మమ్మగారు... "దాని భవిష్యత్తును నిర్ణయించుకోవల్సింది అదికాని మనముకాదు" అనేవారు రంగనాధముగారు. నళిని యింకా చదువుకుంటానంది. రంగనాధముగారు ఏంచదువుతావు... ఎందాక చదువుతావని అడగలేదు. తన యిష్టమువచ్చిన చదువుకి ఎన్నుకునే స్వాతంత్ర్యము ఆమెకే యిచ్చారు. ... ఆఎన్నుకోవడములో తనశక్తి సామర్థ్యాలని చూసుమనే ఆయన అభ్యర్థించారు.

---

నళిని తనకు ప్రసాదింపబడ్డ అవకాశాలని పూర్తిగా వినియోగ పరచుకుంది. ఆమె ఎమ్. ఎస్సి. పూర్తిచేసింది.... "అనుకున్న చదువు అయిపోయిందిగా... యికనైనా పెళ్లిచేయండి" అని బతిమాలేవారు లక్ష్మమ్మగారు... "ఏంతల్లీ ఏమంటావు" అని రంగనాధముగారు నళినినే అడిగారు.

నళినికి సంఘములో స్త్రీస్థానముగూర్చి కొన్ని అభిప్రాయాలున్నాయి. సంఘములో భర్త భార్యని చాలా నీచముగా చూస్తున్నాడనీ... దానికికారణము స్త్రీ తనస్వశక్తి మీదనిలబడలేక ప్రతిదానికి భర్త మీద ఆధారపడ్డమే కారణమని... యిప్పుడున్న మధ్యతరగతి కుటుంబాల ఆర్థిక వ్యవస్థ చక్కబడి సంసారాలు బాగుపడాలంటే భార్యాభర్తలు యిరువురు సంపాదించాలని... కట్నాలవలన అనేకకుటుంబాలు నాశనమవుతున్నాయని యీ కట్నాలు నశిస్తేకాని స్త్రీకి ముక్తిలేదని భావించేది. రంగనాధముగారు తనని పెళ్లిగురించి అడిగినప్పుడు ... "యింతచదువూ చదివాను. నాస్వశక్తిమీద నిలబడి వుద్యోగము చేసుకుంటాను. యింక పెళ్లిఅంటారా నేను వుద్యోగము చేయడానికి అభ్యంతరముండకూడదు. కట్నాకానుకలు ఏమీ పేణాతీసుకోకూడదు. యీషరతులకి లోబడినీరు ఎవర్ని చేసుకోమన్నా చేసుకుంటాను" అంది నళిని. దానికి రంగనాధముగారు ఒప్పుకున్నారు. అంతే కాదు... "తల్లీ! నీమనసులో ఎవరయినా వుంటేచెప్పడానికి సంకోచించకు... అతను యోగ్యుడనినువ్వుభావిస్తే, అతనే కులమువాడయినా నాకభ్యంతరంలేదు" అన్నాడు.

ఇన్ని అవకాశాలు, యింత స్వాతంత్ర్యము సాధారణముగా ఏ స్త్రీకి లభించవు. నళినికి యధోచితముగా లభించిన యీ అవకాశాలు అదృష్టము ఎంతో సంఘర్షణ ఎంతో ధైర్యముతోకాని చాలమంది స్త్రీలకి లభించవు. నిజముగా రంగనాధముగారే లేకపోతే తనజీవితము తన చిన్ననాటి స్నేహితురాండ్రవలెనే అయ్యేది.

సోమయాజులుగారి మనవరాలు. చాకలిపద్దుకు సరిపడ్డ చదువుచదివింది. పెద్దమనిషి కాకుండానే వాళ్లవాళ్లు పెళ్లిచేశారు. కాని మొగుడు పోగానే ఆపంచ యీపంచఆశ్రయించి నానాకష్టాలు పడుతోంది. కమల పెళ్లి వెంటనే ఏటేటా కాన్పులువచ్చి రోగిష్ఠిదయి ఎందుకూ పనికిరానిదయింది. సరోజిని కొంతవరకు నయము. ... తాను చదువుకున్నది కొద్దిఅయినా స్వశక్తివలన హిందీపరీక్షలు ప్యాసయి, ట్యూషన్లు చెప్పుకుంటూ తనబట్టలు పిల్లల బట్టలు తినేసుట్టుకుంటూ కాలము గడుపుతోంది... రెండువైపులా డబ్బున్న మాలతి పనిమటుకు ఏం బాగుంది? మొగుడు చేతికివచ్చిన ఆస్తివ్యసనాల పాలుచేస్తున్నాడు... తనతల్లిమాట ప్రకారము తనకీ అప్పుడే పెళ్లిచేసివుంటే తను యిల్లాగే వుండేది.

నళిని ఆవూరి కాలేజిలోనే లెక్చరరుగా పనిచేస్తోంది. రంగనాధముగారు నళిని పెండ్లివిషయముగూర్చి సంబంధాలు వెతుకుతూనే వున్నారు. కాని ఏంలాభము?... ఏ సంబంధమూ నళిని పెట్టినషరతులకి అంగీకరించడములేదు. అందరికీ కట్నము కావాలి. ఎవరూ నళిని వుద్యోగము చేయడము అంగీకరించరు. అందుకని వచ్చిన సంబంధాలు తిరిగిపోతున్నాయి.

ఎవరినయినా ప్రేమించి పెళ్లిచేసుకుంటే!—తను ఎరుగున్న పురుషరూపాలన్నీ మనసులో మెదిలాయి... కాని తను వాళ్లలో ఎవర్ని ప్రేమించలేదు... ప్రేమించుకుని పెళ్లిచేసుకోవడము వక్క సినిమాలునవలల్లోతప్ప ఎక్కడా కన్పించదు... ప్రేమిం



చిత్రకారుడు: శాంతి సా.

# మద్రాసుప్రభుత్వ విద్యాలయ విద్యార్థుల చిత్రకళా ప్రదర్శనం



పెంపుడు మేక (బాస్‌రిలీఫ్)

చిత్రకారుడు: [illegible]

 నళిని 

తపించవల్సివచ్చింది ... చదువుకట్టిపెట్టి
తను నేర్చుకున్న టైపుసహాయముతో ఒకం
పెనిలో టైపిస్టుగాచేరాడు... తనకీ ఆదుర
దృష్టములేదుకనుక తను ఎం.ఎస్.సిప్యాసయి
లెక్చరరు పనిచేయగలుగుతోంది...
చిన్నప్పుడు యిద్దరూ అనేకవిషయాలు
గురించి చర్చించేవారు. యిప్పుడేమయింది
ఆస్నేహము?...యిద్దరి అంతస్థులూ
వేరయ్యాయి. వారిస్నేహాలు ఒక స్మృతి
గానే మిగిలిపోయింది. నిజానికి నళిని
వుద్యోగము చేస్తుండగా ఒక్క
నాడేవచ్చాడు, పదిరూపాయిల చేబదులు

అతని ఆత్మాభిమానము తలచుకుంటే ఆశ్చర్యము వేస్తుంది.. తనుఇంట్లో ఎంత అవస్థపడుతున్నా... బీదరికములో ఎంత కృశించిపోతున్నా... ఎవర్నీ సహాయము అర్థించేవాడు కాడు.. నళిని సహాయము చేద్దామన్నా స్వీకరించేవాడు కాడు.. తను బీదవాడయినా యాచకుడు కాలేదుట.

అటువంటివాడు ఎంతో అవసరముంటే కాని చేబదులుకయినారాడు. తను మాట్లాడకుండా పదిరూపాయిలిచ్చింది ... ఫస్టు తారీఖుకల్లా యిస్తానన్నాడు .. మూడు నెలలు గడిచాయి. అతను మళ్ళీ మొగము చూపించలేదు...పదిరూపాయలు ఎగగొట్టాడని మనిషి మారిపోయాడని తను అనుకుంది కాని మూడు నెలలుతర్వాత అతను తనచెల్లెలుద్వారా పదిరూపాయలు పంపుతూ ఓ ఉత్తరం వ్రాసాడు. "అడిగిన వెంటనే మీరు నాకు డబ్బుఇచ్చారు కాని, అన్నమాటప్రకారము నేను యివ్వలేకపోయాను నన్ను మోసగాడని మీరు భావిస్తూవుండవచ్చు.. కాని ఏంచెయ్యను? పరిస్థితులు అట్లాంటివి!... ఏమయితే నేం యీనాటికి నేనుమీ డబ్బు యివ్వగలిగాను. మీ మొగము చూడ్డానికి సిగ్గుగావుంది. ఆలస్యానికి క్షమిస్తారని ఆశిస్తాను." మొగము చెల్లక చెల్లెలుద్వారా పంపాడు... ఆపదిరూపాయలు ఇవ్వక్కర్లేదు ఏఖర్చుకయినా వస్తాయి నీదగ్గరవుంచు అన్నా అతను నేను 'యాచకుని' కాను అన్ని ఆ డబ్బు తిరస్కరించాడు

తనని చిన్నప్పటినుంచి ఎరుగున్నాడు. అతన్ని తనుఎరుగుంది ఒకరిగురించి ఒకరికి తెలుసు ఒకరిమీద ఒకరికి ప్రేమవుంది యీపరిస్థితులలో అతన్ని ఎందుకు పెళ్లి చేసుకోకూడదూ? మోయలేక సతమతమవుతున్న అతని సంసారభారాన్ని తను ఎందుకువహించకూడదూ?.. మరింకొకర్ని పెళ్లిచేసుకున్నా యింతకంటె ఎక్కువ సుఖపడగలనన్న మాటయేమిటి?

నళిని వళి రంగనాథముగారితో యీవిషయము చెప్పినప్పుడు ఆయన ఆశ్చర్యపోయారు లక్ష్మమ్మగారు.. "యిదేమిటే యింతదదువుచదివి.. అతన్ని చేసుకోవడ మేమిటే" అంది . నళిని లక్ష్మమ్మగారికి జవాబు చెప్పకుండానే రంగనాథము గారితో... "అదికాదునాన్నా యిద్దరికీ సమానావకాశాలువుంటే అతనేనాకన్నా వున్నతస్థితిలో వుండేవాడు' అంది .. రంగనాథముగారు "నీయిష్టప్రకారమే కాని రవిని నేను బాగా ఎరుగున్నాను యోగ్యుడు బుద్ధిమంతుడు అతనిని పెళ్లిచేసుకోవడానికి నీకులేని అభ్యంతరము నాకు దేనికి తల్లీ!" అన్నారు

* * *

నళిని తనని పెళ్లిచేసుకోబోతున్నదని రవి చాలా ఆశ్చర్యపోయాడు. తనని ఏం చూసి చేసుకుంటోంది— చదువుందా! ... పెద్ద వుద్యోగముందా!... తరగని ఆస్తివుందా! ...ఏముంది!. వీటన్నిటినీమించి తనవ్యక్తిత్వమే ఆమెని ఆకర్షించడానికి కారణమా!...తనూ ఆమె చదువుకున్న రోజులలో అప్పుడప్పుడు అనుకునేవాడు .. తను నళినిని పెళ్లిచేసుకుంటే బాగుండునని. కాని యిద్దరి అంతస్థులూ గ్రహించాక ఆ ప్రసక్తి ఎత్తే ధైర్యము తనకి లేకపోయింది

ఎంతమంది చెప్పినా తను యిన్నాళ్లు పెళ్లిచేసుకోకపోవడానికి కారణము తనకి నళిని రాసిపెట్టివుండడమే కాబోలు! తనకీ ఎన్నో సంబంధాలు వచ్చాయి. వెయ్యి రెండు వేలు కట్నమివ్వడానికి సిద్ధపడ్డారు కూడాను. కాని తను చేసుకోలేదు. వాళ్ళిచ్చే కట్నము పెళ్లి ఖర్చులకి సరిపోతుంది ఇప్పటికే తన సంసారము పెద్దదయి సతమతమవుతుంటే యింకో భారమా!

పెళ్లిచేసుకుని తను సుఖపడలేడు... ఎవర్నీ సుఖపెట్టలేడు. ఎందుకువచ్చిన బాదరబందీ అందుకని ఎవరుచెప్పినా పెళ్లి చేసుకోలేదు

నళిని యిప్పుడు తనని పెళ్లిచేసుకోబోతోంది చిన్నప్పటినుంచి తనని ప్రేమించిందన్నమాట. అతనూ సంతోషముతో సమ్మతి తెలియజేసాడు కాని సమాజములో తనకన్న తనభార్య ప్రతిపత్తి ఎక్కువఅని. ఆమెముందు తను ఎందుకూ కొరగానివాడిగా భావింపబడ్తాడని గ్రహించివుంటే అతను యీ పెళ్లికి అంగీకరింపకపోయేవాడే!

శుభలేఖమీద నళిని ఎం.ఎస్.సి. అని వుంది తన పేరుముందు ఏముంటుంది? ఏడిగ్రీ తగిలించుమంటాడు! వధువు కాలేజీలో లెక్చరరు పనిచేస్తోంది వరుడు యింటరు ప్యాసయి టైపిస్టుపని చేస్తున్నాడు. ఆశుభలేఖ మాస్తుంటే అతనికి ఎంతో చిన్నతనము కలిగింది "అదృష్టవంతుడవోయి! యిన్నాళ్లు ఆగి బంగారు పిచికని పట్టావు" అన్నాడుతోటి గుమాస్తా అవధాని మోటుగామాట్లాడటములో అవధాని మొనగాడు.

పెళ్లి అయిపోయింది. యిదివరకటి గబ్బిలాలకొంపమార్చి చక్కటియిల్లు తీసుకున్నారు ఆయింటికిబోర్డు ఎం.నళిని ఎం ఎస్ సి. అని— కాని రవి ఏమని బోర్డు కొట్టుకుంటాడు అది నళిని గృహముకాని తన గృహము కాదనిపించేది

యింట్లో అందరూ నళినే అసలు యింటి యజమానిగా భావించేవారు. అవును మరి? నళినివచ్చాక వారి దారిద్ర్యము తొలగిపోయింది ఇదివరకు కడుపునిండా తిండి వుండేదికాదు మంచిబట్ట వుండేదికాదు. పాచిపని చేసేందుకయినా మనిషివుండేది కాదు ఇప్పుడు అవన్నీ అమరాయి. వంటలక్కని పెట్టుకున్నారు తన ఆఫీసు వేళకి భోజనము పెట్టడానికి విసుక్కునే తనతల్లి...నళిని కాలేజి వేళకల్లా వంటయ్యేట్టు తొందరపడ్తోంది.

"యీ కూర యిల్లాఎందుకు వండావు" "చిన్నమ్మగారు వండమన్నారు అందుకని వండా'నని వంటలక్క. "దానికి అవిధముగా చేస్తే యిష్టమురా అందుకని అల్లాగే నేను చేయమన్నా"నని తన తల్లి అనేవారు. తన యిష్టా యిష్టాలు ఎవరికి కావాలి?

అన్నివిధాలా తను నళినికన్న తక్కువ. బయటవాళ్ళకీ యింట్లోవాళ్ళకీ అదే అభిప్రాయము అందరూ తనకన్న నళినిని ఎక్కువ గౌరవిస్తారు. తను అమాయకుడయిపోతున్నాడు. ఒకప్పుడు తనుగృహయజమాని; యిప్పుడు నళిని .. యిటువంటి అభిప్రాయాలు అతనిలో తెలియకుండానే ఏర్పడిపోయాయి యీపరిస్థితులలో తన ఆత్మాభిమానము ఆధిక్యత కాపాడుకోవాలని భావించేవాడు....యీదృక్పథముతోనే రానురాను ప్రతిసంఘటనని ఎదురుకున్నాడు

తను లేకపోతే యీ యిల్లులేదని ... తన పెళ్లికి పూర్వమున్న అయింటిలోమనుష్యులనీ, యిప్పటి మనుష్యులనీ చూస్తే నళిని అనిపించేది తను లేకపోతే ఆమురికికూపములోనేవుంటూ తినడానికి తిండిలేక కట్టడానికి బట్టలేక వుంటూ వుండేవారు. దీనికి తనపట్ల అందరూ కృతజ్ఞత చూపిం

#  నళిని 

కాలి... అయింట్లో తనహోదా అందరి కోడాకన్న ఎక్కువ. యీ విషయము అందరూ గుర్తించాలని.. నళిని తనకి తెలియకుండానే భావించేది అదికాక నళిని తక్క గాని వక్క పిల్ల అవడము మూలాన్న ...యింట్లోకూడా ఆమెనే పైచేయిగా వుండేది ... ఆ అలవాటు యిక్కడ చూపుతే తక్కినవాళ్ళమాటకేంగాని రవి కిమటుకు చాలకోపముగావుండేది...రాను రాను రవి ప్రతివిషయాన్ని తను చులకన అవడానికి జరుగుతున్నట్టే భావించేవాడు.

ఒకరోజున అతను ఆఫీసుకు సిల్కు బటలు వేసుకు వెళ్లాడు అవధాని అతని వంక ఎగాదిగా చూసి "గెష్! బంగారు పిచ్చిక లభించింది యిక నిరులోటుఏమిటతే!" అన్నాడు "ఆ ఏత్సు ఏత్వకపోతే నీకా అదృష్టము లేదని ఏడవరాదూ!" అన్నాడు యింకో గుమాస్తా ... "అదృష్టము! పెళ్లాము చేత ఇబ్బ తింటూ పెళ్లాము కొంగుకట్టు పడేవుండడమూ అదృష్టమే!" అన్నాడు అవధాని వాని కొంపుటాలు ఎగరేస్తూ!

పెళ్లాము తరఫున ఆస్తివస్తే అనుభవించడానికి సిద్ధపడే పెద్దమనుష్యులు, ఆడదాని దగ్గరనుంచి కట్నము వస్తే కాని పెళ్లి చేసుకోమనే మహానుభావులు... ఆడది వుద్యోగముచేస్తూ మొగుడుకన్న ఎక్కువ సంపాదిస్తుంటే ఎందుకో అంత నీచముగా చూస్తాము అనుకునేవాడు రవి

ఆనాడు అవధాని అన్నమాటలు అతని మనసెంతో గాయపరిచాయి. అతను అన్నమాటలే చెవులలో మ్రోగినాయి డాక్యుమెంట్లన్నీ పాడుచేశాడు మేనేజరు పిలిచి ... "ఇవి డాక్యుమెంట్లు అనుకున్నావా కోమటిగుమస్తా పద్దులనుకున్నావా" అని హుంకరించాడు.

రవి ఆఫీసుకి క్రొత్త మేనేజరు వచ్చాడు. ఆయనభార్య నళిని సహాధ్యాయినులట. అంతకుపూర్వము ఆవిషయము అతనికి తెలియదు..."అమ్మా! నళిని ఎక్కడికి వెళ్లిందే" అని అడిగాడు రవి ఆసాయంత్రమువచ్చి... "తనతో చదువుకున్న అమ్మాయి భర్తకి యీవూళ్లోనే వుద్యోగమయిందట...వాళింటికి వెళింది..."ఆలస్యముగా వస్తానని చెప్పింది. రవికి అంతాక ఆస్నేహితురాలెవరో ఆమెభర్త ఎవరో తెలియదు

నళిని కనేకమంది స్నేహితురాండ్రు. స్నేహితులు. వాళ్లెవరూ అని తనూయిందాకా అడగలేదు ఆమె చెప్పాలేదు! తనని ఎప్పుడు ఆమె తనస్నేహితురాండ్రకి యింట్రడ్యూసు చేయలేదు ... అయినా ఏమనిచేస్తుంది?..యింట్రడ్యూసు చేయకపోవడమే మంచిది అనుకునేవాడు రవి

ఆరాత్రి తొమ్మిదిన్నరకి తనమేనేజరు అతనిభార్య నళినిని కారులో దింపారు... అప్పుడు తెలిసింది.. ఆ స్నేహితురాలి భర్త తన మేనేజరేఅని ... తనదగ్గర పని చేసే టైపిస్టుభార్య ఎం. ఎస్ సి. ప్యాసయినదంటే మేనేజరుఎంతఆశ్చర్యపోయాడు!...

అప్పుడెప్పుడు ఎందరో స్నేహితులు నళినికోసము వచ్చేవారు తను వాళ్ళలో కలవలేకపోయాడు తనఅంతస్తువేరు వాళ్ల అంతస్తు వేరు... వాళ్లహోదాలు వేరు తన హోదా వేరు .... వాళ్లలో ఎల్లా కలిసిపోగలడు!

రవి ప్రతి చిన్నవిషయానికి తను చిన్నతనముగా బాధపడ్డము... తన ఆత్మాభిమానము ఆత్మగౌరవము యీ పెళివల్ల మంటగలిశాయని బాధపడము... దాన్ని రక్షించుకోవడమే తన పరమావధి అనుకోవడము మొదలుపెట్టాడు... నళిని తనంతటి స్త్రీలేదని... తను దయతల్చి రవిని పెళ్లి చేసుకోవడముమూలన్న వాళ్లకష్టాలు గట్టెక్కాయని.. రవి చేసేది వుద్యోగముకాదని భావించడము మొదలుపెట్టింది... దీనివలన యిద్దరి మధ్యఈర్ష్యలు సర్వసామాన్యమయ్యాయి స్వల్పవిషయాలమీదకూడ ఘర్షణ తప్పనిసరి అవుతోంది.. ఇదివరకట నళిని కాదు .ఇప్పుడు వటి గర్విష్టి అనిరవి పూర్వపురవి కాదు పట్టెచుప్పనాతి అని నళిని భావించేవారు .. ఎవరూ తమలోవచ్చిన మార్పు గుర్తించక. అవతలి వాళ్లు మారిపోయారని భావించేవారు . యీవివాహము చేసుకోవడములో తొందరపడ్డామని నళిని రవి యిద్దరూ భావించేవారు. యీపెళ్లి జరగకపోతే తాము సుఖముగా వుండేవాళ్లమని వాళ్ల భావన. యీపరిస్థితులలో వాళ్లసంసారాలు విచ్ఛిన్నమయిపోవడానికి ఏ వక్క చిన్న సంఘటనయినాచాలు.

* * *

"ఇవాళ ఇందిరపుటినరోజు మన యిద్దర్నీ డిన్నరుకి తప్పక రమ్మంది" అంది నళిని .

"నేను రాను..."అన్నాడు రవి.

"ఎందుకని.. మరిమరీ చెప్పింది"... అని ప్రశ్నించింది ..

"నీస్నేహితురాలి పుట్టినరోజు డిన్నరుకి రాకల్సిన అవసరమేముంది? అయినా మీరంతా చదువుకున్నవాళు పెద్ద వుద్యోగస్థులు .. మధ్య నేనుదేనికి?"అన్నాడు రవి అక్కసుతో!

ఇటువంటిమాటలు నళిని విని విని విసుగెత్తిపోయింది "ఇందులో అవమానానికేముంది ! అయినామీరు నాభర్త రవి చెప్పుకోవడానికి నాకులేనిసిగ్గు మీకుదేనికో" అంది నళిని..

"నీకు సిగ్గులేకపోవచ్చు ..కాని నాకభిమానముంది" అన్నాడు రవి మొగము ఎర్రచేసుకుని

'ఎందుకువచ్చిన అభిమానము . చేసేది మషివుద్యోగము' యింకా వాక్యము నళిని పూర్తిచెయ్యలేదు "నోటి కెంతవస్తే అంత వాగుతావా" అంటూ రవి నళిని చెంపమీదకొట్టాడు .నళిని తెల్లపోయింది. తను మనసులో పడేపడే అనుకున్నమాటే నళిని అనడము అతను సహించలేకపోయాడు

"నా మీద చెయ్యిచేసుకుంటావా... నువ్వు కొట్టినా తిట్టినా పడివుండడానికి .. నేనేం గతిలేనిదాని ననుకున్నావా! ." అంది నళిని కోపముగా...

"పిచ్చిగావాగుతే బయటికి గెంటుతాను"అన్నాడు రవిగట్టిగా "నువ్వెగంటే

దేమిటోయ్!... నే నేపోతాను.. యీ యింట్లో నేను ఒక్క క్షణంవుండను..."

యీ పరిణామానికి నళిని అత్తగారు ఆశ్చర్యపోయింది. ఆవిడవచ్చి కొడుకు నే మందలించిపోవడముతో రవి ఆవిడని గట్టిగా కసురుకున్నాడు...ఆమెయింకా ఏదో చెప్పబోతే...ఆవిడమీద చెయ్యిచేసుకున్నాడు...

"పెళ్ళాముమీద తల్లిమీద చెయ్యిచేసుకున్నవాడివి మనిషివేనా? యికనువ్వు నాభర్తకాదు! నేనునీభార్యనికాను"అంటూ నళిని ఆయింటిని విడిచిపెట్టింది

* * *

"నువ్వు తొందరపడ్డావమ్మా" అన్నాడు రంగనాథముగారు నళిని చెప్పినదంతావిని. ఇంతవరకూ నళిని చేసినపనిని దేన్నీ ఆయన ఖండించలేదు నాన్నగారామాట అనే టప్పటికి నళిని తికమకపడి "అల్లా అంటారేం! నాన్నా.. బ్రూటులాగన్నా ఆముసలిఆవిడనికూడా కొడితేను"

"నా! భర్తని అంతమాట అనకూడదమ్మా! ..."అన్నాడు రంగనాథముగారు మందలింపుగా!

"ఎందుకువచ్చిన భర్తనాన్నా!... పెళ్ళి అయ్యాక ఏ ఒక్కరోజు సుఖపడ్డాను? నాసంపాదనంతా ఆయన కుటుంబానికే యిచ్చానా? .."

"అయితే అది నీకుటుంబముకాదా తల్లీ!"

"అవునుకో ఆయనకి ఆ విశ్వాసమే ముంది ప్రతిదానికి ఘర్షణా! ప్రతిదానికి కజ్జా! యిక నేను ఆసంసారాన్ని చేయలేను నాకాభర్త అక్కర్లేదు! .."

"అంత త్వొందరగాపోయేది కాదమ్మా మన వివాహవ్యవస్థ. సరేలే! యిప్పుడు నేను ఏమిచెప్పినా నీకు తలకెక్కదు.... అనతికాలములో మీ పొరపులు మరచిపోయి కలుస్తారని ఆశించడముకన్న.... ఆవిధముగా భగవంతుని... ప్రార్థించడముకన్నా నేనేం చేయగలను..." అన్నారు ఆయన బాధగా...

తండ్రి బాధపడుతున్నారంటే నళిని ఎంతో గిజగిజలాడింది కాని అయింటికి వెళ్ళడానికి ఒప్పుకోలేదు నళిని కాపురము కూలిపోయిందని లక్ష్మమ్మగారు బెంగపెట్టుకుంది "చదువుకున్నది . కాపురము వెలగబెడ్తుందా.. పిచ్చికాని .. చదువుకున్నవాళ్ళు మొగుళ్ళని గౌరవిస్తారా" యీరకమయిన అమ్మలక్కల మాటలు ఆవిడకి శూలాలుగా గుచ్చుకునేవి నళిని వీటిగురించి పట్టించుకోలేదు ..."రెండు నెలలు తను బింకముగా వుంటే వాళ్ళేవస్తారు తనకాళ్ళదగ్గరికి...తన సంపాదన లేకపోతే వాళ్ళు నానాఅవస్థలు పడతారు... అప్పుడేవస్తారు తనదగ్గరికి ..." అనుకున్నది

రెండుమూడు నెలలు గడిచాయి రవి నళినిగురించికాని నళిని రవిగురించికాని ఏమి తెలుసుకోవడానికి ప్రయత్నించలేదు. రంగనాథముగారే అప్పుడప్పుడు... వాళ్ళనుగురించి తెలుసుకోవాలని ప్రయత్నించేవారు.. నళిని వెళ్ళిపోగానే వాళ్ళు వూరికి చివరగా ఓ చిన్నకొంప తీసుకుని అద్దెకి వుంటున్నారని...మళ్ళీ యిదివరకటిమల్లేనే అవస్థపడుతున్నారని రంగనాథము తెలుసుకున్నారు తాను ఏదో వాళ్ళకి రెండు మూడుసార్లు సాయంచేయబోయాడు కాని రవి.. "యింతవరకు జరిగిన అవమానాలు చాలు.. మీరు వెళ్ళండి అని నిష్కర్షగా చెప్పాడు

ఒకరోజున రంగనాథముగారు..."నళినీ మీఅత్తగారు పోయారుట" అన్నారు.... నళిని తెల్లబోయింది "అదేమిటి నాన్నా" అంది... అవునమ్మా... టైఫాయిడు జ్వరము వచ్చిందిట యివాళిటికి అప్పుడే మూడవ రోజుట.." అన్నారాయన .. "మూడురోజులయిందా! అసలు ఏసంగతీ తెలియనే తెలియదే..." అంది లక్ష్మమ్మ



చిట్టీ బొట్టూ

# ★ నళిని ★

గాక... "యీ మహా పట్టణములో విమానాల ఏం జరిగేది ఎల్లా తెలుస్తుంది? అతనుమనకి కబురయినా పంపలేదు" అన్నారు రంగనాథముగారు బాధగా!

"చూసావా! నాన్నా పెద్దమనిషి అన్నారు .. తల్లిపోతే కబురు చెప్పాలన్న యింగితజ్ఞానమయినా ఆయనకి లేకపోయె" అంది అభిమానముగా గాద్గదికముగా మట్లాడుతూ!

"పదేతల్లీ! . జరిగినదేదో జరిగింది... యిప్పుడునువ్వు వెళ్లాలి వెళ్ళకపోతే బాగుండదు"అన్నాడు రంగనాథముగారు.

"నేను వెళ్ళను నాన్నా! యిప్పుడు వెళ్లి ఏంలాభము?.. అన్నీ జరిగిపోయాక! ... నేను వుండవల్సిన అవసరము లేదనుకున్న వాళ్లింటికి వెళ్ళవలసిన అవసరమేమిటి నాన్నా!...' అంది నళిని.

ఆరోజంతా నళినికి అత్తగారే గుర్తుకు వచ్చారు ఆమె ఎన్నడూ నళినిని పన్నెత్తుమాట అనలేదు ... తనవిఎంతో ఆపేక్షగా చూసేది తనేవుంటే వెంట వేసరయిన వైద్యసహాయము చేయించేది ఆమెప్రాణాలు నిలిపేది . ఆమె మందులేక మరణించింది .ఆమె మరణానికి నేనూ బాధ్యురాలేనే నన్నట్టుగా ఆమె అంతరాత్మ అంటుంటే ఆమె గిలగిల లాడింది బహుశ రవి తల్లి మరణముగురించి కబురుచేసివుంటే నళిని జరిగిపోయిన సంగతులు అన్నీ మరిచి ఆయింటికివెళ్లేది కాని రవి ప్రవర్తనవల్ల అతనిపట్ల ఆమెకి మరింత విముఖత ఏర్పడింది

యిక రవితో సంబంధము శాశ్వతముగా విచ్ఛిన్నమయిపోయినట్టేనని ఆమె భావించింది తనభావి జీవితము గురించి ఏమని వూహించుకుంటుంది ? ఎవరయినా తనని అర్థముచేసుకుని ఆదరించగలవాడు వస్తే తిరిగి పెళ్లిచేసుకుంటుందా? అల్లాఅని అతని కోసము అన్వేషణజరుపుతుందా రవితో నే కాలము గడపాలని కాంక్షించుతుందా! ఎన్నటికీ కాంక్షించదు కాని.. తనకేం సంబంధము లేదనుకున్నా . . రవి వాళ్లు పడే కష్టాలు వింటుంటే తనకే ఎంతో బాధగావుండేది తను వెళ్లితే వాళ్ళ కష్టాలు గట్టెక్కుతాయని తెలుసు.. కాని తనకేనా అభిమానములేనిది?

రవి పూర్వము బీదరికము అనుభవించిన మాట వాస్తవమే! కాని యీమధ్య అలవాటుతప్పిపోయింది .. యిప్పుడు మళ్లా ఆపేదరికము అనుభవించడమంటే ఎంతో బాధగావుంది .... యింట్లో అందరూ నళినివుంటే బాగుండుననుకునేవారు తనకీ నళినివుంటే బాగుండునని తొందరపడి ఆనాడామెమీద చెయ్యిచేసుకున్నానని తెలుసు .... కాని ఆమెని పిలవలేడు ... తనతల్లి మరణానికి తనుకారణమని తెలుసు .. నళినేకనుకవుంటే.... కనీసము ఆసంగతి తల్లికి తెలిసివుంటే వైద్యసహాయము ఆమెకి లభించివుండేది ... కాని ఆత్మాభిమానముతో తను ఆపని చేయలేడు కనీసము ఆవిడపోయినతర్వాతయినా నళినికి కబురంపలేదు. . కథ యింతజరిగాక ఆమెని ఎల్లా పిలుస్తాడు? పిలుస్తే తనూ ఇంకా చులకనయిపోతాడు.

రవి తల్లిపోయినప్పటినుంచి . యింటి పనులన్నీ రవిచెల్లెలు పదమూడేళ్లపిల్ల మీద పడ్డాయి .పాపము పసిపిల్ల ఎన్ని పనులు చేయగలదు? ...పదింటికల్లా రవికి భోజనము అవ్వాలి ... వంటసరిగా లేకపోతే పసిపిల్ల కష్టపడుతుందనయినా లేకుండాతిట్టేవాడు.... పాపము ఆపిల్ల .. కుమిలి కుమిలి ఏడ్చేది.

రవితమ్ముడు ఎస్ ఎస్ ఎల్ సి చదువుతూ వుండేవాడు .. వాడికితెలుసు ఎన్నాళ్ళకీ కట్టకపోయేసరికి అతని పేరు కొట్టేసారు . అతను బడికివళ్లడము మానివేశాడు ఒకరోజునరవి . "యింట్లోపడి తేరగా తినకపోతే ఏదయినా పనిచేసుకోకూడదూ" అన్నాడు . "నాకు వుద్యోగము ఎవరిస్తారన్నయ్యా" అన్నాడు అతను . 'వుద్యోగము లేకపోతే కూలి తెలు మోయి' అన్నాడురవిదిసుగా...అంతే ఆసాయంత్రమే రవి తమ్ముడు యింటనుంచి వారిపోయ్యాడు....

యీసంగతి నళిని విన్నతర్వాత . ఆమె హృదయము కలగిపోయింది. తను ఆయింటికి వెళ్లపోవాలనిపించేది . తనూరవి .. తమ అహంకారాలు నెరవేర్చుకోవడానికి మధ్యగా అమాయకుల ప్రాణాలు బలి పెడ్తున్నారని తెలిసేటప్పటికి నళిని హృదయము ద్రవించింది కాని పట్టుదలయింకా పూర్తిగాపోలేదు.

* * *

ఆరోజు మధ్యాహ్నము ఎవరికీ తెలియకుండా రవిచెల్లెలు నళిని దగ్గరకి వచ్చింది, రెండుమైళ్ళ ఎండలోనడిచి ..

"ఏం లతా! యిల్లా వచ్చావు" అని అడిగింది నళిని ఆమెని దగ్గరకి తీసుకుని .

"ఏంలేదు వదినా నిన్ను చూద్దామని' అంది. .

"చిన్నన్న సంగతి తెలిసిందాలతా!...."

"లేదు వదినా!. . ఎక్కడికి పోయాడో ఏం అవస్థపడుతున్నాడో! ...' అంది లతి సన్నగా ఏడుస్తూ. లతని చూసేటప్పటికి నళిని కళ్ళలోకూడా నీళ్లు తిరిగాయి

"ఇంత చిక్కిపోయావేం లతా!... అన్నము వండటము లేదా!"అని ఆమె అన

(41-వ పేజీ చూడండి)

# బొమ్మరిల్లు



## కట్టు కథ



కవిరావు

నరునికంటను బడదు
నా రాజ భవనమ్ము
చూచి నంతనె ఎగిరి
చుక్కల్లలో గలియు
నరుని కంటను బడదు...
రంగారు బంగారు
సింగారముల తోడ
మెరసిపోవును కనుల్
మిరుమిట్లు గొలుపంగ.

అందులో ఒకరాణి
ఆమె వీణాపాణి
ఆభరణములు గలిగి
నా భవనమునవుంది.

రాహస్యముగ నీకు
రావమ్మ చెప్పెదను
ఇక్కడే, మనగోడ
ప్రక్కనే వున్నదది!
నరునికంటను బడదు...
ఏడు సంద్రాలవల
మేడలో నొకమూల
చూడ చక్కని కన్య
గాఢ నిద్రలోవుంది.

చెదరిపోయిన జుట్టు,
చేతిగాజులు, రెండు
చెవుల పోగులు! కళ్ళు
చెదరి పోవుచు నుండె

మంత్ర దండము త్రిప్పి
'మహాంకాళి' అంటేను
చూచుకో! త్రుళ్ళిపడి
లేచి కూర్చుంటుంది.

నవ్వితే ఆపిల్ల
నవరత్నములు రాలు,
నాకుగాకను యింక
లోకులకు తెలియదే!

రాహస్యముగ నీకు
రావమ్మ చెప్పెదను
యిక్కడే, మనగోడ
ప్రక్కనే వున్నదే!
నరుని కంటను బడదు...
జలము తెచ్చుట కీవు
కొలని కేగంగానె
మెల్లగా నేను నా
మేడలో చేరెదను.
తోడ నెవ్వరును రా
కూడదమ్మా మీరు;
మన కుక్క 'జాకీ'ని
కొనిపోదు నచ్చటకు
నరుని కంటను బడదు...
రాహస్యముగ నీకు
రావమ్మ చెప్పెదను.
ఇక్కడే, మనగోడ
ప్రక్కనే వున్నదే!
నరుని కంటను బడదు
నా రాజ భవనమ్ము,
చూచితే పైకెగిరి
చుక్కల్లలో కలియు!

[ఆధారము : టాగోర్]



వాల్ట్ డిస్నీ నిర్మించిన "లివింగ్ డిజర్ట్" అనే వైజ్ఞానిక చిత్రంలో ఎడారి దృశ్యం.

# ఎడారిలో జీవకోటి

ఉత్తర అమెరికా ఖండంలో ఒరిగాన్ నుండి మెక్సికో వరకూ, కాలిఫోర్నియా నుండి టెక్సాస్ వరకూ వ్యాపించిన ఒక పెద్ద ఎడారి ఉన్నది. దీనిని "గ్రేట్ అమెరికన్ డిజర్ట్" అంటారు. పసిఫిక్ సముద్రం నుండి వీచే ఋతుపవనాలను పెద్ద పెద్ద పర్వతాలు అడ్డువేయడం చేత పర్వతాల వెనకభాగంలో వున్న విశాలమైన భూభాగంలో వర్షాలు కురవక ఈ పెద్ద ఎడారి ఏర్పడింది. ఎటుచూచినా ఎండలమైన భగభగ కాలిపోయే ఇసుకమైదానాలు తప్ప మరేమీ కనబడవు. ప్రాణులు బ్రతకడానికే వీలులేదా అనిపించేటంత ఉష్ణోగ్రత (140 డిగ్రీలు) తో ఈ యెడారి భయంకరమై, మానవులకు చొరరానిదై వుండేది చాలరోజులు. కాని విజ్ఞానశాస్త్ర సహాయంతో అనేక సృష్టిరహస్యాలను ఛేదించి ప్రకృతిని వశపరుచుకున్న మానవునికి అసాధ్యమనేది లేదు. కాలక్రమాన ఈ యెడారిలో కూడా ప్రవేశించి అమెరికా వారు అనేక విచిత్రాలు కనిపెట్టారు.

పైకి నిశ్చలంగా, నిశ్చేతనంగా, జీవరహితంగా కనిపిస్తుంది ఈ యెడారి. కాని జాగ్రత్తగా పరిశీలిస్తే కొన్ని లక్షల జంతువులు, చెట్లు చేమలు కనిపిస్తాయి. కొన్ని వేల రకాల జీవరాసులు గోచరిస్తాయి. వాటి జీవితాలను ఇంకా సూక్ష్మంగా పరిశోధిస్తే ఎంత చిత్రమైనదీ సృష్టి అని దిగ్భ్రాంతులమౌతాము.

ఉన్నట్టుండి ఈ యెడారిపైన ఆకాశంలో కారుమబ్బులు క్రమ్ముతాయి. ఉరుములతో, మెరుపులతో, పిడుగులతో వర్షం కురుస్తుంది. నెలల తరబడి నీరులేక నోరెండిపోయినట్లయి దప్పిగొన్న భూమి ఎన్ని నీళ్లు కురిసినా పీల్చుకొంటుంది. కాని వర్షం ఆగదు. ఇంకా కురుస్తుంది. అలా కురిసి కురిసి వర్షజలమంతా పెద్ద ప్రళయసముద్రం లాగ ఉవ్వెత్తున లేచే కెరటాలతో గర్జిస్తూ ప్రవహిస్తుంది. మైళ్ళకొద్దీ దూరం ఏ ఆటంకాలూ లేకుండా ఈ ఉప్పెన ప్రవహిస్తుంది. అలా పోయిపోయి చాలా దూరాన శక్తి ఉడిగి ఇసుకలోనే అంతరిస్తుంది. ఎంత ఉధృతంగా బయలుదేరిందో అంత చల్లగా ఇసుకలో ఇంకిపోతుంది. బురదమాత్రం మిగులుతుంది. ఆ బురదకింద ఎన్నాళ్ళనుంచీ వేచివున్నాయో విత్తులు అంకురిస్తాయి. మొక్కలు లేస్తాయి చిగురిస్తాయి. ఆకులు, పువ్వులూ వస్తాయి. కొలది కాలంలో జీవరహితంగావున్న ఎడారిలో మొక్కలూ, పువ్వులూ పుట్టి రంగురంగుల తివాచీ పరిచినట్లు ప్రకాశిస్తాయి. అంతవరకూ ఎక్కడెక్కడో దాక్కున్న వేలకొలది జంతువులు, రకరకాల ప్రాణులు ఆహారంకోసం, విహారంకోసం బయటికొస్తాయి. బలం కలిగినవి, బలహీనమైనవి, నేలమీద ప్రాకేవి, నడిచేవి, ఆకాశంలో ఎగిరేవి ఎన్నోరకాలు! ఈ బతుకులకి జీవించినంతకాలమూ రెండే రెండు ఆశయాలుంటాయి. ఒకటి, ఇతరజంతువులనుండి, ఆకలిబాధనుండి తమ ప్రాణాన్ని రక్షించుకోవడం. రెండు, తమతో తమ జాతి అంతరించిపోకుండా సంతతిని వృద్ధిచేసుకోవడం.

కొన్ని మొక్కలు తమ ఆకులను ముళ్లుగా మార్చుకుంటాయి. కొన్ని జంతువులు నెలల తరబడి నీళ్లులేకుండా గడపడానికి వీలుగా శరీరంలోనే జలకోశాలను తయారు చేసుకుంటాయి.

ఈ జంతువుల మధ్య భయంకరమైన పోరాటాలు జరుగుతాయి. జీవితంకోసం సంఘర్షణ ఎడారిలో కనిపించినంత బాహాటంగా ఇంకెక్కడా కనిపించదు. ఎన్నో రకాల పాములు, తేళ్ళు, తాబేళ్లు, ఎలుకలు, ఉడతలు, పురుగులు, పక్షులు ఎడారిలోని జీవితనాటకంలో పాత్రధారులు. ★

కందిరీగ, సాలీడు రెండూ విషం కలిగినవే. సాలీడునుచూస్తే ఎడారిలోవున్న జంతువులన్నిటికీ హడలు. కాని దాంతో కందిరీగ యుద్ధంచేసి చంపేస్తుంది.

*

డేగకూ, ఒక పెద్ద విషసర్పానికీ పోరాటం జరుగుతుంది. చివరికి పాము చచ్చిపోతుంది.



# వినోదం - విషాదం

జె. సత్యనారాయణ (సత్యశ్రీ)

చిన్నప్పుడు ఆకతాయితనంగా చేసినతప్పులు, పెద్దయిన తరవాత కూడా గుర్తుకొచ్చినప్పుడల్లా, మనస్సును ఎంతో బాధిస్తుంటాయి. వినోదానికిపోతే విషాదం ఎదురౌతుందని అప్పుడు అనుకోలేదు.

మేము ఫిఫ్తుఫారం చదువుకుంటున్న రోజులు. మాఊరు గోదావరిగట్టున ఒక పల్లెటూరు. మేము మొత్తం అయిదుగురము. అందులో డేవిడ్ నేను, శాస్త్రీమాత్రం ముఖ్యులం. మా ముగ్గురిలో డేవిడ్, వయస్సులో, అల్లరిలో, అల్లరికి అవసరమయిన తెలివితేటలలో పెద్దచెయ్యి. చదువుమీద శ్రద్ధ అంత ఎక్కువగా ఉండేదికాదుమాకు. ఎప్పుడూ క్లాసులో తిట్లు తింటం, బెంచీలు ఎక్కటంతోటే సరిపోయేది. శని, ఆదివారాలు వచ్చాయంటే చాలు - దేవాలయంలో చేరి కబుర్లు చెప్పుకుంటూనో, గోదావరి గట్ల వెంట తిరుగుతూ పడవషికార్లు వెళ్లడంతోనో, లేకపోతే చెట్లు పుట్టలు ఎక్కడంలోనో గడిపేసే వాళ్లము.

మా ఊళ్లోనే 'తాతయ్య' అనే ఆయన ఒకరుండేవారు. చాలా మంచివాడు. అందరితోటీ కులాసాగా కబుర్లు చెబుతూ కలిసిమెలసి ఉండేవాడు. అందరితో కంటే మాతో ఎక్కువ ఆప్యాయంగా చనువుగా ఉండేవాడు. మాకెప్పుడూ చిత్రవిచిత్రమైన కథలు వినిపిస్తుండేవాడు. ఒకరోజున యిలానే దయ్యాల విషయంలో మాకూ, ఆయనకూ వాదనపడింది.

“మీరు వెయ్యిచెప్పండి, లక్షచెప్పండి! దయ్యాలు ఉన్నాయని ఘంటాపథంగా చెప్పగలను।” అన్నాడు తాతయ్య బల్లగుద్ది.

“కాని మామూలు దయ్యాలు అందరికీ కనిపించవు— రాక్షసగణాన్ని పుట్టినవాడికితప్ప! కొరివి దయ్యాలయితేఅందరికీ కనిపిస్తాయి. నేను స్వయంగా చూచాను కూడా చాలాసార్లు! నెత్తినపెద్ద అఖండం ఎప్పుడూ వెలుగుతూ ఉంటుంది. జుట్టువిరబోసుకుని, ఒకకొరివి చేత్తో పట్టుకొని తిరుగుతూ ఉంటుంది. కొన్నిపెంకి దయ్యాలయితే మనుషుల్ని జడిపిస్తాయికూడా! అప్పుడు ఏకొంచంజంకినా మనపనిపట్టినయ్యన్నమాటే...!”

గాలిలోకొన్ని మండేపదార్థాలు ఉండి అలాకనిపిస్తూ ఉంటాయని, కొరివి దయ్యాలనేవిలేవని, అదివట్టి భ్రమేనని ఎంతోచెప్పాము. మా సైన్సుమాస్టరుగారు క్లాసులోచెప్పినదంతావల్లించాము. కాని తాతయ్య మేముచెప్పినది వినిపించుకోలేదు.

ఇళ్ళకు వెళ్ళిపోయే ముందు నన్ను శాస్త్రీని ఆపుచేశాడు డేవిడ్. “ఇప్పుడు తాతయ్యచెప్పినదాన్ని బట్టిచూస్తుంటే నాకొకమంచి ప్లాను తడుతున్నదిరా।” అన్నాడు డేవిడ్నవ్వుతూ “మొన్న మనకరణంగారింటి ప్రక్కనుండే అచ్చమ్మనే ముసలమ్మచచ్చిపోలేదూ? ఆముసలమ్మకు తాతయ్య నలభై రూపాయలబిల్లుకు బాకీఉన్నాడు. ఆవిడకు ఇంకెవరూ లేరుటగా! ఆసొమ్మంతా తాతయ్యదే అయిపోతుంది. అందుకని దాన్ని మనమిప్పుడు రాబట్టుకోవచ్చు.”

“అంటే ఆ కొరివిదయ్యపువేషం మనం వెయ్యాలన్నమాట.”

మొదటవాడి ఉద్దేశ్యంతో ఏకీభవించలేక పోయినాము. కాని తరువాత ఒప్పుకున్నాము. ఈ ప్లాను వేసుకున్న అయిదవనాడే పొరుగూర్లో “భాగోతం” వేస్తూ ఉన్నారు. డేవిడ్, శాస్త్రి, నేను ఆసాయంత్రమే తాతయ్య దగ్గరకు వెళ్లి ఆవీధి నాటకాన్ని గురించి గొప్పగా పొగిడేశాము.

మా ఊరునుంచి ఆ వీధినాటకం ఆడే ప్రదేశానికి వెళ్లాలంటే పొలాలమీదుగా, కాలిబాటన వెళ్లాలి. వేసవికాలం కావటంవల్ల అంతా బయలుగావుంది. ఆఊరికి, మాఊరికి సరిగ్గా మధ్యలో, కాలిబాటకు కొంచెం దూరంలో రెండు పెద్ద మర్రిచెట్లు ఒకటిగా కలసిపోయి, మొదలు దగ్గర పెద్ద తొర్రలా ఏర్పడి ఉన్నది. కొరివిదెయ్యపువేషానికి అవసరమయ్యే వస్తువులన్నీ ఆ సాయంత్రమే ఎవరూ చూడకుండా, ఆచెట్టు తొర్రలో దాచేసి యింటికి తిరిగి వచ్చాం.

నాటకానికి బయలుదేరుతూ తాతయ్య యింటికెళ్లి వెంటతీసుకు పోయినాము.



రెండు మగతాబేళ్ళు పోరాడేదృశ్యం. ఇవి ఒకదాన్నొకటి చంపుకోవు. వెల్లకిలాపడిన తాబేలు ఓడిపోయినట్లే లెక్క. అక్కడితో దాన్ని వదిలేసి గెలిచిన తాబేలు ఆడతాబేలు వెంట పరుగెత్తుతుంది.

ఆట మంచి 'రసకందాయం'లో ఉండగా, అతనితో చెప్పకుండా ముందుగా లేచివచ్చి, మర్రిచెట్టుదగ్గర కాచుకు కూర్చున్నాం. మేము వచ్చేయటం తాతయ్య కనిపెట్టలేదు.

మా డేవిడ్ వేషం వేసుకున్నాడు. ఇంట్లో వాళ్ల అక్కయ్యతో చెప్పకుండా తెచ్చిన నల్లకోక, నెత్తిన కుంపటిలో మంచి నూనె దీపం, చేతిలో కొరివి, తలకి తెల్ల జనపనారతో చేసిన విగ్గు, ముఖానికి మసి, కళ్ల చుట్టూరా తెల్లటి సున్నగీతలు — వాటితో డేవిడ్‌ను చూసేసరికి మాకే వణకు పుట్టుకు వచ్చింది. క్షణంలో తేరుకుని, ముందు ముందు తాతయ్య పడేకంగారును ఊహించుకొని అందరూ నవ్వుకున్నాం.

ఒకవేళ తాతయ్య ఎవరితో నన్నా కలిసివస్తే మేముచాల నిరాశ చెంది ఉండేవాళ్ళము. కాని అలా జరగలేదు. తాతయ్య చేతికర్రకి ఉన్న 'కంచు అందె' మోత వినిపించింది!

తాతయ్య చెట్టుదాటి నాలు గడుగులెయ్యగానే కుంపటిని, కొరివిని వెలిగించి సిద్ధమైనాడు డేవిడ్.

వెనకాలేవెళ్ళి, తాతయ్యను సమీపించి కంఠస్వరం మార్చి గట్టిగాఅరచాడు!

"ఒరే! తాతయ్యా! ఆగు... తప్పించుకుందా మనుకున్నావా?"

తాతయ్య ఉలిక్కిపడి, వెనక్కి తిరిగిచూచాడు. వెంటనే కళ్లు మూసుకొని, 'బాబోయ్'' అని అరచాడు.

"తప్పించుకుందా మనుకున్నావుట్రా? నేనెవరినో తెలుసా? అచ్చమ్మను రా! అచ్చమ్మను !!"

తాతయ్యపాపం వణకిపోయినాడు. నోటమాటరాలేదు.

"అ...చ్చ.. మ్మ...నా...?"

"అవునురా! అవును—నేనుచచ్చి

## ★ వినోదం, విషాదం ★

పోయానని మురిసి పోతున్నావా? చచ్చినా సాధిస్తానురా! దయ్యాన్నయ్యాను— దయ్యాన్ని...! నా బాకీమాట మర్చిపోయావుట్రా!"

తాతయ్యకి మహా ధైర్యంవచ్చేసింది!

"నీలాంటి దయ్యాలను లక్ష మందిని చూచానే! నువ్వేం చేసి ఏడుస్తావ్ ముసలిదానివి" అంటూ చేతికర్రపైకెత్తేడు!

ఆ వేటు నిజంగా మావాడి బుఱ్ఱ మీదపడితే ఏంకాను? డేవిడ్ ధైర్యంచేసి కఱ్ఱ మీదపడకముందే, చేతిలో కొరివిని తాతయ్య మీదకు విసిరేడు! అది అతని చేకి తగిలి నేల మీద పడిపోయింది. తాతయ్య 'బాబోయ్!' అంటూ పలాయనం చేయబోయినాడు. కాని, ఆ 'దయ్యం' వదలలేదు.

"ఆగు— అడుగు ముందుకువేసేవంటే తల నూరు చెక్కలై అక్కడేపడి చచ్చిపోతావ్ ...! జాగ్రత్త! నాకు సమాధానంచెప్పి మరీకదులు!"

తాతయ్యపాపం 'రకీ'మని ఆగిపోయినాడు, పారిపోవటానికి కాళ్లు రాక.

"ఎప్పుడిస్తావురా నాబాకీ! చెప్పు! ఇవ్వకపోతే నిన్ను సర్వనాశనం చేస్తాను!" తాతయ్య కొంచెం దారిలోపడ్డాడు.

"ఇప్పు...డె...లా...గ!"

"మరెప్పుడురా! రేపొద్దున్నే నాబాకీ వడ్డీ పైసలతోసహా లెక్కచూసి, ఈ చెట్టు తొఱ్ఱలో ఎవరూ చూడకుండా పెట్టు! ఏం? పెడతావా? "తాతయ్య నోరు తెరచి "ఉ!" అనగలిగాడు.

"అయితే యికవెళ్లిపో! రేపుగనుక ఈ తొఱ్ఱలో నాడబ్బు లేకపోయిందంటేనా? జాగ్రత్త! వెళ్లిపో! ముసలిముండ ననుకున్నావా? తెలిసిందా? వెళ్లు... వెళ్లిపోవేరా ఇంకా?

తాతయ్య పాపం వెనక్కిచూడకుండా పరుగెత్తాడు! మొదట మాకు నవ్వుగావున్నా చివరికి చాలా విచారం వేసింది!

తరువాత ప్రొద్దున్నే తాతయ్యను చూడటానికి వెళ్లాము. మాటిమాటికి ఉలిక్కిపడుతున్నాడు. రాత్రి కాలిన పుండుకు కట్టుకట్టేడు.

సాయంత్రం బడినుంచి రాగానే ఆ చెట్టుదగ్గరకు వెళ్లి చూచాము. ఒక కాగితపు పొట్లం కనిపించింది! విప్పిచూచుకున్నాము. దానిలో, నాలుగు పదిరూపాయలనోట్లు,

రెండు చిల్లరనోట్లు, (రూపాయ నోట్లు), ఒక అర్ధరూపాయకాసు, రెండుకానులు ఉన్నాయి.

డబ్బు చూడగానే మా ఉత్సాహం ఉబికింది. నాలుగు రోజుల పాటు తెగతిరిగి కొంత చేరుకున్నాం.

చేరుకోగానే ముగ్గురమూ కలసి తాతయ్య యింటికి వెళ్లాము. గుమ్మంలో ఆయనభార్య తలమీద చెయ్యి వేసుకొని కూర్చున్నది. మమ్మల్ని చూడగానే ఆమె ఒక్కసారిగా భోరుమన్నది! "అయ్యో నాయనా...!ఇంకెక్కడి తాతయ్య గారండోయి! ఆముసలి దెక్కడ దాపరించిందో నాయినో...!" అని బావురుమన్నది!

మేము నివ్వెర పోయినాము. నోటమాట లేదు. వణుకు పుట్టింది.

"ఏమయిందండీ!" అన్నాడు డేవిడ్ కొంచెం సంబాళించుకుని.

"ఏముంది నాయినా? మొన్న ఆపాడు వీధినాటకానికెళ్ళిన తెల్లవారిన దగ్గరనుంచి ఒకటే పరధ్యాన్నంగా ఉంటటం! మాటి మాటికి ఒకటే ఉలిక్కిపడ్డం! అదిగి నా నాతో ఏమీ చెప్పలేదు. రెండోనాడు బాగాజ్వరం కాసింది. ఆరాత్రల్లా కలవరింపులు — ...! అచ్చమ్మబాకీ ... అని, మధ్య మధ్య 'బాబోయ్' అని ఉలిక్కిపడేవారు — ఆరాత్రే ఎక్కడికో లేచివెళ్ళి పోయారు బాబోయ్!! అదెక్కడ దాపరించిందో... దాని బాకీపాడుగాను...

"దయ్యమై ఆయన్ను తీసుక పోయింది గ్రామాలు దేముడో...!" అంటూ గోలపెట్టింది.

మేము స్తంభించి పోయినాము. తేరుకొని ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నాము. ఆసమయంలో ఆవిడను ఓదార్చాలనికూడా తెలియక చరచరా నడిచివచ్చేశాము.

కొంతదూరం రాగానే డేవిడ్ చేతులతో ముఖాన్ని కప్పుకుని గట్టిగా భోరుమన్నాడు. అప్పటి వరకూ అణచిపెట్టుకున్నాము కాని మేముకూడా బావురుమని ఏడ్చాము.

ఎంత ఏడిస్తేమాత్రం లాభమేముంది, అఘాయిత్యం జరిగిపోయిన తరువాత! ఆతరవాత తాతయ్యఏమైనాడో, ఎవరికీ కనిపించలేదు. ★

## నళిని

(84-వ పేజీ తరువాయి)

చేతులు తీసుకుంది. రెండు చేతులమీద బొబ్బలు.

"ఏమిటిలతా! యీబొబ్బలు" అని అడిగింది బాధగా...

"ఇవాళ అన్నము వారుస్తుంటే చెయ్యి కాలింది వదినా...రోజూ మామూలే. వదిన నువ్వురావూ! నేను యీ అవస్థలు పడలేను వదినా..." అని నళిని వళ్లో తలపెట్టుకుని బోరున విడ్చింది. లతని కౌగిలించుకుని... నళిని ఎంతసేపు ఏడ్చిందో!

రంగనాథముగారు లోపలికివచ్చి... "ఏమిటేలల్లీ" అని అడిగారు "బండితేండి నాన్నా!... నేను నాయింటికి వెళ్తున్నాను" అందినళిని దృఢనిశ్చయంగా!..

రంగనాథముగారు సంతోషముతో మాట మాట్లాడలేదు... "అల్లాగేనమ్మా" అంటూ బయటికి నడిచారు. ★

# వింత చిలగడదుంప

పూర్వం చైనాలో ఒకరైతు ఉండేవాడు. అతడు తన పొలంలో చిలగడదుంపలు పండించేవాడు. ఆచిలగడ దుంపలే అతని జీవనాధారం. అందుచేత వాటిని ప్రాణ సమానంగా కాపాడుకునేవాడు.

ఒకసారి ఆగ్రామంలోఉన్న ఒక పెద్దరైతు తన గొర్రెలమందను, పందులమందను విచ్చలవిడిగా వదిలిపెట్టినందున, అవన్నీ ఈపేదరైతు పొలంలో పడి మొక్కలన్నిటిని ధ్వంసం చేసేశాయి గొర్రెలు మొక్కల్ని తినేస్తే, పందులు నేలలో ముట్టెలుదూర్చి లేలేత దుంపలన్నిటిని స్వాహా చేశాయి. ఒక్కటే మొక్కమాత్రం అదృష్ట వశాత్తూ వాటిబారిపడకుండా మిగిలింది

తనపొలం ఇలా పాడైపోయినందుకు పేదరైతు ఎంతో దుఃఖించాడు. ఒకటైనా మిగిలినందుకు తృప్తిపడి ఆఒక్క మొక్కనూ కన్నకూతురిలాగ కాపాడుకొంటూ, రోజూ నీళ్లుపోస్తూ, బాగా ఎరువులు వేస్తూ పెంచాడు. చలికాలం వచ్చింది. పొలమంతటా మంచు పేరుకుపోయింది అయినా అతడు సాహసంచేసి మొక్కను పెల్లగించలేకపోయాడు. మళ్లీ వసంతకాలం వచ్చింది. మొక్కను పెల్లగించి చూశాడు. దాని అడుగున బ్రహ్మాండమైన చిలగడదుంపవుంది. ఒక వందమందిపొట్టలు నింపేటంత పెద్దదిగా ఆదుంప పెరిగింది. అది చూసి పేదరైతుఎంతో ఆశ్చర్యపడ్డాడు.

ఇంతలో ఆదారిన పల్లకీలో పోతున్న జిల్లా న్యాయాధికారి అక్కడఆగి ఆవింత దుంపనుచూసి "ఎంత చిత్రంగావుంది!" అన్నాడు.

ఆయన కూడావస్తున్న అధికారులు "అద్భుతం!" అని ఆయన మాటను సమర్థించారు.

ఆగ్రామంలోని పెద్దరైతు కూడా "ఆశ్చర్యం!" అని వంతపాడాడు

"నువ్వుదీన్ని చక్రవర్తి గారికి కానుకగా ఇవ్వాలి," అన్నాడు న్యాయాధికారి.

"అంటే వూరికే ఇచ్చివెయ్యమనా మీఉద్దేశ్యం? మరినేనేం తినను?" అన్నాడురైతు.



కుమారి శాంతారెడ్డి (బందరు) నృత్య భంగిమ

"ఇంత అపురూపమైన విచిత్ర వస్తువును నువ్వు ఉపయోగించరాదు. తక్షణం చక్రవర్తి గారికిచ్చి వెయ్యి. లేకపోతే నా తడాఖా చూపిస్తాను," అన్నాడు న్యాయాధికారి.

మర్నాడు న్యాయాధికారి చక్రవర్తికి ఒకవినతిపత్రం సమర్పించాడు: "చల్లని మీ యేలుబడిలో దేశమంతా సుభిక్షంగా వున్నదనడానికి నిదర్శనంగా తమ సామ్రాజ్యంలో ఒకచోట ఈవింత చిలగడదుంప కాసింది. దీన్ని ఉపయోగించడానికి తమ ప్రజలెవరూ అర్హులు కానందున, దాన్ని పండించిన రైతు దాన్ని మీకు సమర్పించవలసిందిగా ఆజ్ఞాపించడమైనది...."

ఈవినతిపత్రం చూసి చక్రవర్తి పొంగిపోయాడు. ఆ చిలగడదుంపతో ఏంచేయాలో ఆయనకు పాలుపోలేదు. కాని దాన్ని స్వీకరించాడు. దాన్నితనకు పంపించిన న్యాయాధికారిని ఇంకా ఉన్నతపదవిలో నియమించాడు. దుంపను పండించిన రైతుకు ఒకరత్నహారం బహూకరించాడు.

ఆరత్నహారాన్ని చూసి పేదరైతు విచారపడ్డాడు. అతనికి ఆకలి వేస్తోంది. హారాన్ని కొరుక్కుతింటాడా. ఊహు. పోనీ అమ్మేస్తాడా? ఊహు. చక్రవర్తిఇచ్చిన బహుమతి అమ్మి వెయ్యడమే?

కాని ఆవూళ్లో సేద్యం చేస్తున్న పెద్ద రైతుకు కన్నుకుట్టింది. "ఈముసలి రైతుకు ఎంత అదృష్టం పట్టింది. వెధవ చిలగడదుంపకు రత్నహారం బహుమతి కొట్టేశాడు! నేనుకూడా చక్రవర్తికి ఏదన్నా కానుక ఇస్తే బాగుండును!" అనుకున్నాడు.

## వింత చిలగడదుంప

రాత్రింబగళ్లు ఆలోచించాడు. ఆలోచనవల్ల కొంచెం జబ్బుకూడా చేసింది చివరికి పెద్దరైతుకు ఒక మంచి ఆలోచన తట్టింది. ఇప్పుడు పెద్దపదవిలో ఉన్న పాత న్యాయాధికారి వద్దకు వెళ్ళి మళ్లీ ఒక వినతి పత్రం చక్రవర్తికి వ్రాయవలసిందిగా బతిమాలి కొంచెంలంచం కూడా ఇచ్చాడు.

చక్రవర్తికి అప్పటికే చిలగడ దుంపమీద రోతపుట్టింది. 'ఎందుకు తీసుకున్నానా' అని విచారించాడు. దానికోసం రత్నహారం బహుమతి చేసినందుకు దిగులు పడ్డాడు. ఇంతలో ఇంకో వినతిపత్రం వచ్చింది. అదిచదివి 'ఈసారిమోసపోకుండ జాగ్రత్తపడాలి,' అనుకున్నాడు.

తనసన్నిధికి వచ్చిన పెద్దరైతును "ఏం తెచ్చావు నువ్వు?" అని తీవ్రంగా అడిగాడు చక్రవర్తి.

"తమకొలువులో సేవ చేయడానికి నా కుమార్తెను తీసుకొచ్చాను" అన్నాడు పెద్దరైతు.

చక్రవర్తి అందమైన ఆపిల్లను చూశాడు. ఆమెంటికి మంటికి ఏకధారగా ఏడుస్తోంది. వెంటనే ఆమెను అంతఃపురంలోకి పంపించాడు చక్రవర్తి.

"సరే. సంతోషమైంది: నీకు ప్రపంచంలో ఎక్కడా దొరకని అపురూపమైన బహుమతి ఇస్తాను" అని చక్రవర్తి ఉదారంగా అన్నాడు.

పెద్దరైతు ఈమాటవిని పొంగిపోయాడు ఆ సంతోషం నుంచి తెప్పరిల్లక ముందే రాజభటులు వింత చిలగడదుంపను అతనియెదటకు తీసుకువచ్చి వుంచారు. దాన్ని అత్యంత భయభక్తులతో అందుకుని రైతు తన యింటికితీసుకుపోయాడు. తనభవనంలో మధ్యహాలులో అందరికీ కనబడేలా దాన్ని వుంచాడు. దాన్ని తినడానికీ వీల్లేదు, అవతల పారెయ్యడానికీ వీల్లేదు. తన దురదృష్టాన్ని నిందించుకుంటూ ఆరైతు చక్రవర్తి ఇచ్చిన బహుమతిని అలాగే ఉంచుకున్నాడు.

తన చిలగడదుంప ఫలానారైతు ఇంట్లోకుళ్ళిపోతోందని తెలిసి "ఏం చక్రవర్తులు! ఏంమనుషులు! పేదరైతుకు రత్నహారమూ, పెద్దరైతుకు చిలగడదుంపానా? ఏం చిత్రం!" అనుకున్నాడు పేదరైతు మళ్ళీ పొలం తవ్వకో సాగాడు. ★

[చైనాదేశపు జానపదకథ [



హైదరాబాద్ "బాలభవన్" గ్రంథాలయంలో బాలబాలకులు శ్రద్ధతో పుస్తకములు చదువుతున్న దృశ్యం

ఒకానొకప్పుడు లండన్‌నగరంలో ఒకముసలివాడు చిన్న దుకాణం ఒకటిపెట్టుకొని జీవిస్తూ ఉండేవాడు ఆ దుకాణంలో పురాతనవస్తువులు— పదిహేనో శతాబ్దపు పెన్సిళ్ళు, పదహారో శతాబ్దపు కలంపుల్లలూ వంటివి దొరికేవి

ఆముసలివానికి ఒక పదేళ్ళ మనమరాలు ఉన్నది. ఆఅమ్మాయి పేరు నెల్. వారిద్దరూ హాయిగా కాలం వెళ్లబుచ్చుతూ ఉండేవారు.

పగటిపూట విశ్రాంతి సమయంలో నెల్ తాతకి అదీఇదీ చదివి వినిపిస్తూ ఉండేది సాయంకాలం కాగానే ఇద్దరూ పొలాలమీదికి షికారు పోయేవారు చీకటిపడిన తరువాత, తాత మనమరాలికి, చనిపోయిన ఆమెతల్లి—అంటే తన కూతురును గురించి చెప్పుండేవాడు. నెల్‌కి తల్లినిగురించిన కబుర్లంటే చాలాఇష్టం. తాతచెప్పిన విషయాన్నే మళ్లీమళ్లీ పదిసార్లు చెప్పినా, విసుగుకొనేది కాదు. ఇంకా చెప్పమని కోరి ఎంతో కుతూహలంతో, ఆనందంతోవినేది ఈ విధంగా తాతా మనమరాళ్లు హాయిగా కాలం గడుపుతున్నారు

ఇలా సుఖంగా ఉంటున్న ముసలివానిలో కొంతకాలానికి ఒకమార్పు వచ్చింది. రాత్రిపూటఅతడు ఎక్కడికోపోయి, ఉదయాన ఇంటికిరావటంసాగించాడు. ఇంటికి వచ్చేసరికి ఎంతోఅలసిపోయి, చికాకుగాఉండేవాడు కళ్లు చింతనిప్పులలాగా ఎఱ్ఱగాఉండేవి. రాత్రిళ్లు అతడు ఎంతమాత్రం నిద్రపోవటం లేదని స్పష్టంగాచెప్పవచ్చు పైగా తనలో తాను "నేనింకాకష్టపడి, బాగా సంపాదించాలి. నెల్‌కోసం ఎంతో డబ్బుగడించాలి నేను కళ్లుమూసేనాటికి నెల్ గొప్ప ధనవంతురాలు కావాలి." అని గొణుక్కుంటూ ఉండేవాడు

ఒకరోజున నెల్ తాతదగ్గరకు వెళ్లి "ఏంతాతా! ఎందుకు ఇలా చికాకుగా ఉంటావు? ప్రతిరోజూ రాత్రిళ్లు ఎక్కడికి పోతున్నావు? ఇంకా కష్టపడి నన్ను ధనవంతురాలిగా చెయ్యాలంటున్నావేమిటి? ఇప్పుడుమనకు కావలసినంత లేదా? ఇప్పుడుమాత్రం మనం సుఖంగా లేమూ?" అని అడిగింది.

తాత ముగ్ధుడై నెల్‌ని హృదయానికి హత్తుకొన్నాడు. "కాదమ్మా! నేనింకా పనిచేయాలి నిన్ను లక్షాధికారిగా చేయాలి. నువ్వు గొప్ప ధనవంతురాలివి కావాలి. అప్పుడావని నాకు తెలుసు ఇంతకంటె పెద్దభవంతిలో నువ్వు హుందాగాతిరగాలి" అన్నాడు.

నెల్‌కి ఇదంతావింటూ ఉంటే కష్టంగాతోచినా, తాత ఆనందం కోసం "అలాగే కానీ తాతా." అంటూ చిన్న చేతులతో అతనిమెడ పట్టుకొని కౌగలించుకొన్నది.

నెల్ ఉంటున్న ఇంటిసమీపంలోనే క్రిస్టఫర్ అనే ఒకయువకుడు ఉన్నాడు. అతడుచాలా బీదవాడు, అయితే మంచి మర్యాదస్తుడు. అతడు ఈముసలివానిఇంట్లో పని చేసేవాడు. ఉదయానేవచ్చి అన్ని పనులు చక్కపెట్టుకుని, సాయంత్రం అయ్యేసరికి ఇంటికివెళ్లిపోయేవాడు. ఎంతోగౌరవంతో, అభిమానంతో క్రిస్టఫర్ వారికి సేవ చేసేవాడు. నెల్‌కిఅతనంటే చాలా ఇష్టం. అతనిని 'కిట్' అనిపిలిచేది.

ఒకరోజున తాత నెల్‌నిపిలిచి పొరుగునఉన్న "క్విల్ప్" అనేవానికి చూపించవలసిందిగా ఒక ఉత్తరం ఇచ్చిపంపించాడు. కిట్‌కూడా ఆమె వెంటవెళ్లాడు.

ఈ క్విల్ప్ అనేకదుష్కృత్యాల వల్ల డబ్బుఆర్జించి, పెద్దధనవంతుడైనాడు ఇప్పుడు ఆడబ్బును వడ్డీకిస్తున్నాడు నెల్ తాత అప్పటికే అతనివద్ద కొంతఅప్పు తెచ్చాడు. మరి కొంతపైకంకోసమే, ఇప్పుడు నెల్‌నుపంపించింది కూడా. ఇంత డబ్బుతీసుకొనివెళ్లి ముసలివాడు ఏంచేస్తున్నాడో తెలుసుకోవాలని క్విల్ప్‌కు బుద్ధిపుట్టింది. అందుచేత తనభార్యను నెల్‌తోమాట్లాడుతూ ఉండవలసిందిగా చెప్పి, తాను ప్రక్కగదిలో ఉండి అంతా

★ జూదరి ★

విన్నాడు. తనతాత రాత్రిళ్లుఇంట్లో ఉండకపోవటం, తెల్లవారి ఇంటికి వచ్చేసరికి ఆయనకళ్లు నిప్పుకణాలలాఉండటం అంతా చెప్పింది అమాయకంగా నెల్.

"మీ తాత రాత్రిళ్లు ఎక్కడికి వెళ్తున్నాడు? వెళ్లి ఏంచేస్తాడు? నీకేం తెలియదా" అని అడిగింది క్విల్ప్ భార్య.

"ఆ భగవంతుడికి తెలియాలి. మా తాత మునుపటంత ఉత్సాహంగాలేడు నాకు కూడా దిగులుగాఉంది." అంటూ నెల్ భోరున ఏడవటం ప్రారంభించింది క్విల్ప్ భార్యఓదారుస్తూ ఉండగా, క్విల్ప్ లోపలినుండివచ్చి ఉత్తరానికి సమాధానం ఇచ్చాడు. "రెండుమూడు రోజులలోవచ్చి మీ తాతతో మాట్లాడుతానులే చెప్పమ్మా" అన్నాడు. నెల్ "సరే"నని కిట్ తో కలిసి ఇంటికి వెళ్ళిపోయింది. వాళ్ళిద్దరూ వెళ్ళిన తరువాత క్విల్ప్ భార్యతో చెప్పాడు

"చాలా బాగుంది ముసలివాడి విషయమంతా తెలిసి పోయింది. వాడు రాత్రిపూట పేకాటఆడటానికి పోతున్నా డన్నమాట. పేకాటలో డబ్బు సంపాదించాలని వాడిఉద్దేశ్యం! డబ్బంతా పోగొట్టుకొని అప్పుకు బయలుదేరాడు. వారికి ఇకమీదట ఒక్క దమ్మిడీ ఇవ్వను లోగడఇచ్చింది కూడా వెంటనే వసూలుచెయ్యాలి."

నెల్ ఇంటికిపోయి క్విల్ప్ ఇచ్చిన ప్రత్యుత్తరాన్ని తాతకిఅందిచింది. నెల్ డబ్బు తెస్తుందనే ఉత్సాహంతో ఉన్న తాతకి నిరాశ కలిగింది. చేతిలోడబ్బు లేకపోవటం చేత రెండురోజులు ఎక్కడికి పోకుండా, అతికష్టంమీద ఇంట్లోనే ఉన్నాడు. మూడవరోజున కూడా క్విల్ప్ రాలేదు. "క్విల్ప్ ఇంకా రాలేదు. ఇప్పుడు నేనేంచేయాలి? నా వ్యాపార మంతా ఏమైపోను? ఎంతోడబ్బుగడించాలని నేను వేసుకున్న పథకమంతా పాడై పోయింది." అని విసుక్కున్నాడు.

నెల్ అతని ఒళ్లో కూర్చుంది. "చూడుతాతా! మనకి ఇంకా డబ్బెందుకు? ఇన్నాళ్ళూ మనం హాయిగా బతకలేదూ? ఇంకాగడించాలని ఎప్పటినుంచి నువ్వు అనుకుంటున్నావో,అప్పటినుంచి మనకి సుఖంలేకుండా పోయింది. ఈదరిద్రపుగొట్టుస్థలంనుంచి మనం వెళ్ళిపోదాం. ఇక్కడ ఇంక ఉండవద్దు. హాయిగా పగలంతా పొలాలవెంబడి తిరుగుదాం. రాత్రిళ్ళు ఏచెట్టు నీడనో పడినిద్రపోవచ్చు. మనఇద్దరికీ చాలినంత నేను ఎలాగోముష్టి ఎత్తిపట్టుకొనివస్తాను. ఇప్పుడే మనం ఇక్కడనుంచి వెళ్ళిపోదాంపద!" అంటూ నెల్ ఏడవటం ఆరంభించింది. తాతకుకూడా ఏడుపు వచ్చింది. చాలాసేపు వారిద్దరూ అలాగే దుఃఖిస్తూ కూర్చున్నారు. కొంతసేపటికి తాత తలఎత్తేసరికి ఎప్పుడువచ్చాడో ఏమోకాని క్విల్ప్ అక్కడ నిలబడి ఉన్నాడు.

"ఓ! లోపలి కెలావచ్చావ్?" అని అడిగాడు తాత ఆశ్చర్యంతో.

"ఏం? తలుపుతీసిపెట్టే ఉన్నదే" అన్నాడు మామూలు గొంతుతో క్విల్ప్.

"అలాగా? ఎంత సేపయింది వచ్చి?"

"ఇప్పుడే లే. నీ మనవరాలు వీధులవెంట తిరగటం, ముష్టెత్తటం అంటున్నదే అప్పుడు."

ముసలివాడికి చాలకోపం వచ్చింది. కాని అణచుకొన్నాడు. నెల్ ని బయటికి పంపించి వేసి క్విల్ప్ ను అడిగాడు. "డబ్బు తెచ్చావా?"

"లేదు. తేబోవటంలేదుకూడా" అని క్విల్ప్ మొరటుగా సమాధానం చెప్పాడు.

"ఏం? ఎందుచేత? మంచివాడివి కదూ! మానాయన! నువ్వు నాకు ఎన్నిసార్లో సహాయం చేశావు. ఇంతవరకు నా వ్యాపారం వల్ల నాకు ఒక్కదమ్మిడీ లాభం కలగలేదు. ఇప్పుడిప్పుడు కాస్త లాభించేటట్లున్నది. రాత్రికల కూడా వచ్చింది. నన్ను కనికరించి ఈఒక్కసారి సహాయంచేయి."

"నాకు తెలుసునులేవయ్యా! నీ వ్యాపారంఏమిటో? ఇంకా అదేదో లాభసాటి వ్యాపారం అనుకున్నాను జూదంలో డబ్బు తగలపెడుతున్నావని తెలిసింది. ఇక మీదట నీకు పైసాఇవ్వను. లోగడ ఇచ్చిన బాకీ తీర్చు."

"నేను జూదమాడు తున్నానని ఎవడు నీకుచెప్పింది?"

"ఎవడోఒకడు ఎవడైతేనేం?"

"ఇంకెందుకు వాడేచెప్పి ఉంటాడు. ఆకిట్! గూఢచారి వెధవ"

కిట్పై క్విల్ప్కి అసూయద్వేషం ఎన్నాళ్ళ నుంచోఉన్నది. ఇన్నాళ్ళకి పగతీర్చుకునే అవకాశం వచ్చింది అందుచేతక్విల్ప్ కిట్ మీద ముసలివాడి అనుమానం బలపడేటట్లు మాట్లాడి పోయినాడు. క్విల్ప్ వెళ్ళగానే నెల్ పరుగుపరుగునవచ్చి తాతఒడిచేరింది. తాత

మాత్రం ఇటు గమనించకుండా కిట్‌నిపట్టుకొని తిడుతున్నాడు. ఎందుకుతిట్టుతున్నాడో నెల్‌కి తెలియలేదు. ఇలా గంట, రెండుగంటలు అయ్యేసరికి తాతకి ఉవ్వెత్తుగా జ్వరంవచ్చేసింది.

చిన్నపిల్ల పాపంనెల్ ఏంచేయగలదు? ఇరుగుపొరుగు వారు ఒకరిద్దరు సహాయపడి, వైద్యుని పిలిపించారు. తాతకాస్త విశ్రాంతిగా పడుకున్నపిదప నెల్ లేచి కిట్‌దగ్గరకు పరుగుతీసింది ఆమెవెళ్ళేసరికి కిట్ భోజనంచేస్తున్నాడు. అతని తల్లి ఆప్రక్కనే ఏదోపనిచేసుకుంటున్నది. అనుకోకుండా నెల్‌పరుగెత్తుకొని రావడంచూచి, వారు ఆశ్చర్యపోయినారు. తాత అనారోగ్యంగురించి నెల్ వారికిచెప్పింది. కిట్ ఈవార్తవిని అదిరిపడ్డాడు "వెంటనే వైద్యుని తీసుకొనివెళదామా?" అని అడిగాడు.

"అక్కర్లేదు. నువ్వుతాతదగ్గరికిరావద్దు" అనిభయపడుతూ నెల్ మెల్లిగాచెప్పింది

"ఏం ఎందుచేత?"

"ఇప్పుడొక వైద్యుడు వచ్చి తాతనిచూసివెళ్ళాడు. ఆయననిన్ను తాతదగ్గరికి పోనీయవద్దని చెప్పాడు."

"అయ్యో! నేనేంతప్పు చేశాను?"

"ఏమో నేను చెప్పలేనుకిట్. నాకు తెలియదు. ఎవరికీతెలియదు. తాతఎందుకో నీమీద మండిపడుతున్నాడు, నువ్వు బాధపడుతున్నావనినాకు తెలుసు. కాని ఏంచేసేది? నీజీతం నీకుఇచ్చేస్తానుకిట్. రేపటినుంచి నువ్వుపనిలోకి రావద్దనిచెప్పటానికే ఇప్పుడు వచ్చాను."

కిట్ చాలా దుఃఖపడ్డాడు. నెల్ అతనినిఊరడించి, ఇంటికివచ్చేసింది. ముసలివానికి నయంకావటానికి చాలా రోజులుపట్టింది. నెల్ రాత్రింబగళ్ళు అతని ప్రక్కనఉండి ఆప్యాయంగా సేవచేసేది. తనతాత చప్పున కోలుకోవాలని సదా భగవంతుని ప్రార్థించేది. భగవంతుడు అమాయకురాలయిన ఆచిన్నపిల్లని కరుణించి, ఆమె ప్రార్థనవిన్నాడు. కొంతకాలానికి తాత కోలుకొని పూర్వపు ఆరోగ్యాన్ని సంపాదించాడు.

నెల్‌తాత ఇలాజబ్బుతో పడిఉన్నరోజులలోనే క్విల్ప్ఆతనిదుకాణాన్ని ఇంటిని తనకు రావలసిన బాకీక్రింద స్వాధీనపఱచుకున్నాడు. క్విల్ప్‌కి బ్రాస్‌అనే ఒక మిత్రుడు ఉన్నాడు. వాడు బహుదుర్మార్గుడు. క్విల్ప్‌కి అతని క్రూరకృత్యాలు కొన్నితెలుసు అవి బయటపెడతాడేమోనన్న భయంకొద్దీ బ్రాస్ ఎప్పుడూ క్విల్ప్‌వెంటఉండి అతనిని పొగడుతూఉంటాడు. నెల్, తాత పైభాగంలో ఉంటుండగానే వీరిద్దరూకలిసి దిగువభాగంలో మకాంపెట్టారు.

ముసలాయన కాస్త తిరగటం ఆరంభించిన తరువాత ఒకనాడు క్విల్ప్ ఆయనదగ్గిరకిచేరాడు.

"ఇప్పుడెలా ఉంటున్నది మీ వంట్లో?"

"కులాసాగానే ఉన్నది."

"మీతోకొంచెం మాట్లాడాలి. మీరు నాకుబాకీఉన్న పైకంక్రింద మీఇల్లు దుకాణం నేనుస్వాధీనం చేసుకున్నసంగతి మీకు తెలిసే ఉంటుంది."

"ఉహు! తెలియదు"

"అలాగా! నేనుస్వాధీనం చేసుకొని అమ్మేశాను."

తాత క్విల్ప్‌కేసి నిశ్చలంగా చూశాడు. క్విల్ప్ఇంకా కొనసాగించాడు:

"ఆరెండింటినీ అమ్మినా నాకు రావలసినపైకం అంతా దఖలుపడలేదు. అయితేమానెలే పోనీండి. ఇంతకూ చెప్పవచ్చిం దేమిటంటే, మీరు తక్షణంఇల్లుఖాళీచెయ్యాలి. ఇల్లు కొనుక్కున్నవారు ప్రవేశిస్తామంటున్నారు.

"సరే."

"ఈ సాయంత్రానికే ఖాళీ చేస్తారా?"

"ఇంతతొందరగాఎలా? ఎల్లుండి ఖాళీచేస్తాను."

"మరిగడువు పెంచకండి"

"ఉహూ!"

క్విల్ప్ వెళ్ళిపోయినాడు. ఆ రెండురోజులు తాత విచారంగానే గడిపాడు. నెల్‌తోమాట్లాడుతున్నప్పుడుమాత్రం, కాస్త నవ్వేవాడు. ఖాళీ చేయవలసినరోజు వచ్చింది. ఆఇల్లు విడిచిపెట్టి వెళ్ళాలన్నసంగతి తెలిసి నెల్‌ఎంతమాత్రం విచారపడలేదు. తనతాతకి, తనకు కొన్నాళ్ళనుంచి సుఖం లేకుండాపోయింది. ఆచోటువిడిచిపెట్టి ఎంత తొందరగా వెళ్ళిపోతే అంతమంచిదనిఆమె సంబరపడింది. తన అల్లిక సామగ్రిని సజ్జలో పెట్టుకొని, కొంచెంరొట్టె, తాతగుడ్డలు సర్ది బయలుదేరింది.

ఇంకా సూర్యోదయం కాకముందే నెల్, తాతబయలుదేరారు. తాత చేతికర్రపట్టుకున్నాడు. నెల్ సజ్జ చేతిలోపట్టుకొన్నది. ఇద్దరూ గుమ్మందాటి రోడ్డుఎక్కారు.

(ఇంకా వుంది)

# ★ అయింది, అబ్బాయిగారి పెళ్లి ★

(౮-వ పేజీ తరువాయి)

రాజన్ సంభాషణ జరిగింతరవాత - ఉగాది పచ్చడిలాంటి ఫుల్లని, తియ్యని ఆలోచనలతో సుశీల యిల్లు చేరుకుంది. దారిలో ఆమెకు నటరాజన్ సంభాషణా అదీ తలుచుకుంటే మొదట నవ్వొచ్చింది. తర్వాత జాలివేసింది అందరు యువకుల్ని అవలీలగా కాదనిన, కాలదన్నిన సుశీల ఎందుచేతో 'నటరాజన్ కేం తక్కువ?' అనుకోసాగింది. అదివరకు ఎన్నోసార్లు క్లాసులో చూసినా అదేమిటో ఆరోజు - ఆ యింగ్లీషు కలరు ఉలెన్ పేంటూ, లైట్ బ్లూ బుష్‌కోటూ - ఆ వేషమూ, ఆ వాలకమూ, ఆ చూపులూ, ఆ మాటలూ ఏమిటో, ఆ విగ్రహం తన కళ్లముందునుంచి కదలడంలేదు! మొట్టమొదట ఆమె కతని మీద 'నామాట వింటే నీకు క్లాసు ష్యూరు' అన్న మాటతో కోపమే వచ్చింది ప్రిన్సిపాల్‌తో రిపోర్టుచేస్తే? అతని జీవితం ఏంకాను? ఛ, అలా ఎన్నటికీ జరగదు!

సుశీల యిల్లు చేరింది. ఆమె ఎప్పుడూ ఏ విషయమూ దాచని తల్లితో జరిగిందంతా చెప్పేసింది. 'త్వరగా పెళ్లి చేసుకోవే నా తల్లీ!' అని ఎన్నిసార్లు మొత్తుకున్నా 'పెళ్లి వద్దు పెడాకులూ వద్దూ నన్నిలా బతకనియ్, చదువుకోనియ్' అని యీ సుశీలే వాళ్లనాన్నగారు చనిపోతూ యిచ్చిన ఎనిమిదెకరాల భూమీ - యీనాటికి ఎకరన్నర చేసింది. ఇక దీనికి పెళ్లెప్పుడవుతుందో - అసలు అవుతుందో అవదో, కట్నమెంత ఎలాగ పొయ్యాలో ఆ తల్లికి బోధపడలేదు. ఇవాళ ఆమెకీ కబురు ఆశ్చర్యం కలిగించడంలో అతిశయోక్తి యేమీ లేదు

'ఇన్నాళ్లకి నిన్నొకడు చేసుకుంటానంటే నే చస్తే నమ్మను' అనేసింది సుశీల తల్లి సుందరమ్మ. అసలే సుశీలకి తగని అతిశయమూ, ఆమె ఊరుకోలేకపోయింది

'నమ్మకపోతే మానెయ్, మరేం మించిపోలేదు'

'అదికాదే, అంతట్లో కోపం తెచ్చుకుంటే ఎలా?.. పోనీ అతడు నీకూడా వచ్చి మాటాడుతున్నప్పుడు ఎవరైనా ఉన్నారా? నీమీద నమ్మకం లేకకాదు - అంత ఉద్యోగంలో ఉన్నతను కానీ కట్నం లేకుండా నీలాంటిదాన్ని చేసుకుంటాడంటే...'

'నువ్వు నమ్మకపోతే మానెయ్. నాకు రుజువు చేసుకోవలసిన అవసరం లేదు. ఇంతకీ జరిగింది చెప్పేనుగాని అతన్ని నేనేం చేసుకుంటానని సిద్ధంగా కూర్చోలేదు' ఇలా అంటున్నపుడు ఆమెకు శర్మ జ్ఞాపకం వచ్చాడుగాని - తల్లిచేత ఎంతో బతిమాలించుకున్నాక తప్ప అతని పేరు సుశీల చెప్పలేదు

ఆవాళ సాయంకాలమే సుందరమ్మ స్వయంగా వరసకి అన్నయ్య అయిన ప్రిన్సిపాలు నారాయణగారింటికి వెళ్లి మాటల్లో అంది.

'ఏదో యిప్పట్లో దానిమనసు తిరుగుతుందనుకోలేదు అన్నయ్యా! ఇంతకీ మీ కాలేజీలో నీకింద పనిచేస్తున్నాడు గనుక అతని సంగతి నీకు తెలిసినంత ఎవరికీ తెలీదు. ఇంతకీ అతనివాళ్లు పెద్దవారెవరూ లేరని విన్నాను. ఇలా ముందు మోజుపడి చేసుకుని తర్వాత ఎంత లారాసిపెట్టినవాళ్లయినా ఉన్నారు. అతనిమటుకు అతనే సిద్ధపడ్డాడని సుశీల అంటోంది. నాకేమో అంత నమ్మకం గాలేదు'

నారాయణ ఆగమన్నట్టు చేత్తో సౌంజ్ఞ చేశాడు. అతని చేతిలో అప్పటికే "లెక్చరర్ దౌర్జన్యం' అనే కాగితం ఉంది! అతడు కాస్సేపు ఆలోచించి 'రేపు పదిన్నరకి కాలేజీకి రా సుందరమ్మా, తిన్నగా నా రూంకి రా' అన్నాడు ఆవిడ ఆశ్చర్యపోయింది.

ఆడపిల్లల రిపోర్టులు అప్పుడప్పుడు అనుభవమున్నా నారాయణ యిదివర కెప్పుడూ యింత యిరుకున పడిపోలేదు. ఒకపక్క లెక్చరరూ/చిన్నవాడయినా చేసింది తప్పే. అయినా—మంచి తెలివైనవాడు. సరిగ్గా పరీక్షలముందు మానిపించేస్తే పిల్ల లేమైపోవాలి? అయినా అతని ఫ్యూచరూ? పోనీ ఊరుకుందామా అంటే ఇదేం రహస్యంగా జరిగిందా, అచ్చు అయి నిచ్చెనెక్కి కూర్చుంది. ఇలాంటప్పుడు తను సరిగ్గా ప్రవర్తించకపోతే యిక కళాశాలలో నీతి ఎక్కడిదీ? సుందరమ్మ వచ్చి మాటాడినప్పుడు మాత్రం అతని చిక్కులన్నీ విడిపోయినట్టే తోచింది!

ముందుగా నటరాజన్ని పిలిచి అడగ్గా అతడంతా ఒప్పుకున్నాడు. సుందరమ్మ మాత్రం 'పిల్లాడు బాగానే ఉన్నాడే!' అనుకుంది. తర్వాత శర్మని పిలిపించారు. అడగడమే తడవుగా శర్మ తన అయిదు నిమిషాలు విన్నదీ అరగంట వర్ణించి చెప్పేడు.

'ఇంకెందుకు మేష్టారూ, నే ఆఖర్ని విన్న పద్యం తలుచుకుంటే నా కిప్పటికీ నవ్వొస్తుంది చెబుతాను వినండి' (ఈపద్యం శర్మ హాస్టలు భావకవి 'రంగరాట్కవి' చేత రాయించాడనీ తర్వాత అతడు మరి కలం పట్టలేదనీ గిట్టనివాళ్లు చెబుతారు!)

"నీ వదనం ఫుల్ శశి
నీ అధరం కిస్ మిసి
నీవు లేని బ్రతుకుంటే
మిస్ సుశీ! ఛస్ మసీ/ పపస్ నిశీ!!!"

ప్రిన్సిపాలు పకపక నవ్వుతూండగా శర్మ వెళ్లిపోయాడు సుందరమ్మ ఆశ్చర్యంగా 'అతగా కవి కూడానే! ఎంత బాగా రాశాడు! ఈసారి సుశీల వద్దన్నా నేను పెళ్లి చెయ్యక మానను!' అంది. నటరాజన్‌ని వెంటనే ప్రిన్సిపాలు పిలిపించి కోపంతో అన్నాడు

'ఏవయ్యోయ్, యివాళనుంచి నువ్వు హోటల్ భోజనం మానెయ్యవలసి ఉంటుంది'

'అమ్మాయ్ సుశీలా, కొన్నాళ్లలో నీ యింటి పేరూ మార్చుకోవలసి ఉంటుంది' ఆయన కృత్రిమకోపం ఆట్టేసేపు ఉండలేదు. నిర్ఘాంతపోయిన నటరాజన్ సుశీలా ఆఖరికి విరగబడి నవ్వుకున్నారు. నటరాజన్ ఆఖరికి అన్నాడు.

'ఆ అబ్బాయి - ఎవరో శర్మట - నేను సరిగ్గా ఎరగనైనా ఎరగను. నిజంగా అతడు చేసిన ఉపకారం జన్మజన్మాలకీ మరిచిపోలేను! అతని ధర్మమా అని ఒక యింటివాడ్నయ్యాను!'

సుశీల నవ్వింది! సుందరమ్మా ప్రిన్సిపాలూ కూడా నవ్వేరు. సుందరమ్మ అంది.

'మొత్తానికి మీ రాలుగాయి మేనగోడలికి పెళ్లి అయిందనిపించావు అన్నయ్యా'

'నే చేసిందేముంది? ఇదంతా ఆ శర్మ పట్టుపట్టి చేయిస్తున్న పెళ్లి. ఇంతకీ మీ అల్లుడ్ని కాసుకో, మరెవరికేనా ఫస్టు క్లాసు లిస్తానని బెదిరించేడు గనక!' సుశీల, నటరాజన్ని మోచేత్తో పొడిచింది. అందరు కలిసి నవ్వుకున్నారు. ★

# ★ అపస్వరాలు ★

(11 వ పేజీ తరువాయి)

పిచ్చివాడికే తెలుస్తుంది!' అన్నాడు సదానందం జిజ్ఞాసతో.

"మన 'వారసి' లేడూ! ఆ గేయాలురాస్తాడే, అతనూ ఇదే మాట అంటాడులే. అదొకపిచ్చి"

"ఆ మాటకొస్తే పిచ్చివాడికి, కళాకారుడికీ మధ్య వ్యత్యాసం సన్నని గీతమాత్రమే"

"ఏమిటండీ? కళ జిజ్ఞాస ముదిరితేపిచ్చివాడైపోతాడనా?"

"కాదులేరా. పిచ్చాడు ఆస్పత్రిలో వుంటాడు, కళాకారుడు సమాజంలో తిరుగుతూంటాడు. పగటికలలు కనటంలో ఇద్దరూ ఒకటే!" అన్నాడు సదానందం లేస్తూ. బ్రహ్మానందం స్నేహితుని విపు దరిచి, "నీ కేస్ ఎలాగో సర్దుతావులే" అన్నాడు.

బిల్లు చెల్లించి ఇద్దరూ, రైలుబ్రిడ్జికింద రోడ్డువెంట పెద్ద మార్కెట్ వేపు నడుస్తున్నారు సదానందం జేబులోంచి సిగరెట్ తీసి వెలిగిస్తూ, "నీ కొద్దులేరా, ఇదొక దురభ్యాసం" అన్నాడు.

బ్రహ్మానందం, "మానేశేనులే...పొరపాటు; నేను మానటం ఏమిటి! పరిస్థితులు మాన్పించాయి అనడం సమంజసం నన్నడిగితే, మానవుడు తనేగొప్ప అనుకుంటూనే, విర్రవీగుతూ పరిస్థితికి బానిసవుతూవుంటాడు. బానిస ఔతున్నకొద్దీ సమాజంలో వృద్ధికివస్తూ ఉంటాడు. కాని ప్రతీమార్పుకూ, తన గొప్పతనమే కారణం అని అంటగట్టుకోవటంలో నే ఆత్మవిశ్వాసం, ఆశా ఇమిడి ఉన్నాయి' అన్నాడు.

సదానందం మారుమాట్లాడకుండా వింటూ నడుస్తున్నాడు. సిగరెట్టు కాలిపోతోంది వేళ్ళమధ్య ఎండ తగ్గిపోయి, పశ్చిమాకాశం, ఎక్కడో క్షితిజందగ్గిర, సిందూర వర్ణంలో మెరుస్తోంది, దిగులుగా దుర్గకొండమీద దేవాలయ శిఖరం విద్యుద్దీపాలతో వెలిగిపోతోంది.

బ్రహ్మానందం, "అరుగోరోయ్, మీ నాన్నగారొస్తున్నారికెే" అన్నాడు, అటు చెయ్యి చూపిస్తో సదానందం, గభాల్న చేతిలో సిగరెట్టు కింద పారేశాడు రంగయ్యగారు, తలొంచుకుని వస్తున్నవాడల్లా బ్రహ్మానందం, "నమస్కారమండి, మేష్టారూ" అనేసరికల్లా తలెత్తిచూసి, ప్రతినమస్కారంచేసి "ఇటు వెళ్తున్నారెక్కడికి నాయనా" అని ప్రశ్నించాడు; కళ్ళజోడుకుండా, చూస్తున్నాడు, వాళ్లు తననుకున్నవాళ్ళేనా అని సంశయం తీరేటట్టు.

సదానందం, మాట్లాడకుండా బుద్ధిమంతుడల్లే నిలబడ్డాడు.

"మార్కెట్టుకి వెళ్తున్నామండి మేష్టారూ" అన్నాడు బ్రహ్మానందం "ఇటెక్కణ్ణించి వస్తున్నారూ?" అని ప్రశ్నించాడు

రంగయ్యగారు, "మరేంలేదు నాయనా, పబ్లిషరు కరుణమూర్తిగారు లేడూ? ఆయనదగ్గిర పనివుంటే వెళ్ళొస్తున్నాను. . వెళ్తా, చీకటిపడుతోంది" అని, కొడుకువైపు చూసి, "తొరగా రారా ఇంటికి, నీతో మాట్లాడాలి, పనివుంది" అనేసి వెళ్ళిపోయాడు బ్రహ్మానందం, సదానందంవేపు చూస్తూ,"పాపం, నాన్నగారికి, చూపు బాగా చెడ్డట్టు కనిపిస్తోంది!" అన్నాడు.

"అవునోయ్ ఒక్క అక్షరం రాయలేకపోతున్నారాయన. ఏమైనా రాయదలిస్తే, మా చెల్లెలిచేత రాయిస్తూవుంటారు."

"అయ్యో! పాపం! ఇది ఇంకా ముదిరితే చాలా కష్టమేనే" అన్నాడు బ్రహ్మానందం మార్కెట్టులోకి దారితీస్తూ.

"కష్టమే, కాని..." ఆపైన ఆలోచనల్ని భరించలేక మానేశాడు సదానందం.

"వొద్దులేరా, అవన్నీ ఆలోచించకు. బాధ." అన్నాడు మిత్రుడు. ఇద్దరూ మార్కెట్టులోకిపోయి, కూరలూ, అరటి ఆకులూ కొనుక్కుని తిరిగి ఇంటిదారి పట్టారు. బాగా చీకటిపడింది. బ్రహ్మానందం, తన ఇంట్లోకి వెళ్తూ "రోజూ కనపడుతూవుండవోయ్, నీతో కాసేపన్నా మాట్లాడితేగాని రిలీఫ్ వుండదు" అన్నాడు.

సదానందం, "నాకూను!" అంటూ ఇంటికి బయిల్దేరాడు ఇంటికొచ్చేప్పటికి ఏడున్నర అయింది.

ఇంట్లో నిశ్శబ్దంగావుంది. పూజగదిలో రంగయ్యగారు, ఏదో సీసపద్యం చదువుతూవుంటే జయ దగ్గిర కూర్చుని రాస్తోంది. రంగయ్యగారు, ఆమె కెదురుగా మందిరానికి కుడివేపు కూర్చున్నాడు, కళ్లుమూసుకుని. చాలా స్థిమితంగా కనిపిస్తున్నాడాయన.

జయ, సిల్కుచీర కట్టుకుని తల్లో చామంతిపూలు పెట్టుకుని, యోగినిలాగా తదేకంగా, ధ్యానమగ్నురాలై కూర్చుని తండ్రి చెబుతూన్న పద్యాలు కాయితాలమీద రాస్తోంది ఎలక్ట్రిక్ లైటు వెలుగుతోంది పూజామందిరంలో సీతారామలక్ష్మణ భరతశత్రుఘ్నులూ, ఆంజనేయులూ వున్న పెద్ద పటానికి రెండు వేపులా నెయ్యిపోసి వెలిగించిన రెండు ప్రమిదలు ముత్యాల్లా మెరుస్తున్నాయి సాంబ్రాణి కడ్డీల సువాసన గదంతా ఘుమఘుమలాడుతోంది.

సదానందం గది బయిటే నిలబడి చూస్తున్నాడు తండ్రి రాగాలాపన చేస్తూ, భాగవతంలో గజేంద్రమోక్ష ఘట్టంలో పద్యాలు రాయిస్తున్నాడు. అది ఆయన స్వంత కవిత్వం. చాలా మధురంగా పడుతున్నాయి పద్యాలు.

రంగయ్యగారొక పదిహేను నిమిషాలు అలాగే రాయించి, విరమించాడు. ఆచమనంచేసి, శ్రీరామునిముందు సాష్టాంగపడి లేచి, "పదమ్మా. ఈ పూటకి చాలు ఇలా రోజూ రాస్తే సంవత్సరంలో పూర్తి అవుతుంది" అంటూ తిరిగి ఏదో ఆలోచించి "ఇంకో నెలకి నువ్వు అత్తవారింటికి వెళ్లిపోతావు! ఇంకెవ్వరు రాస్తారు! ఆ శ్రీరాముడే దిక్కు" అన్నాడు కొంచెం దిగులుగా

జయ లేచి ముందు నాన్నకీ తర్వాత శ్రీరాముని పటానికి నమస్కరించి, "నువ్వు దిగులుపడరాదు నాన్నా! అన్నయ్య లేడా! రాస్తాడులే." అన్నది; రంగయ్యగారు ఆమెని ఆశీర్వదిస్తూ "చల్లని మాట చెబుతావమ్మా! దిగు లెందుకులే తల్లీ, ఎలా జరగవల్సింది అలా జరుగుతుంది" అంటూ, బైటికి వచ్చాడు

సదానందం, ఈలోగా గదిలోకి వెళ్ళి కాళ్లు కడుక్కొచ్చాడు.

జయ, "ఇదుగో, నాన్నా, అన్నయ్య వచ్చాడు", అని "నీకు నూరేళ్ళాయుస్సురా, అన్నయ్యా! ఇప్పుడే నీ మాట అనుకుంటున్నాం" అన్నది

రంగయ్యగారు, "అబ్బాయి, రేపు వుదయం పాసెంజర్కి తెనాలి వెళ్ళిరావాలి. వెళ్ళొస్తావా?" అని అడిగాడు, హాల్లో వాలుకుర్చీలో కూర్చుంటూ.

సదానందం సూటిగా తండ్రి ముఖంలోకి ఎప్పుడూ చూడలేడు; పక్కకి చూస్తూ, "వెళ్ళొస్తా నాన్నా ఏం పని?" అన్నాడు వినయంగా.

"సిద్ధాంతిగారు, ముహూర్తం పెట్టాడు. శ్రావణమాసంలో బహుళ పంచమి మంచిదట. కాస్త మన వియ్యంకుడుగారికి స్వయంగా శుభలేఖ ఇచ్చి రావాలి. మాటకి పైకం సంగతి కూడా చెప్పరా. ముహూర్తంనాడే ఇచ్చేస్తామని. ఒక రోజు ముందే రమ్మను. ఈ భాగ్యానికి ఉత్తరం రాయటం ఎందుకూ, నిన్నే పంపిస్తే పోతుందని, అమ్మా నేనూ అనుకున్నాంలే" అన్నాడు రంగయ్యగారు.

"అలాగే నాన్నా" అని మెల్లిగా జారుకున్నాడు సదానందం తన గదిలోకి.

జయకి ముహూర్తం ఫలానా అని తెలుసుకున్నప్పుడు, ఒక క్షణం వొళ్లంతా జెర్రులు పాకినట్టూ, మంచుగడ్డ తాకినట్టూ రోమాంచితమైంది.

వరలక్ష్మమ్మగారు, "అమ్మాయి! నాన్నని, అన్నయ్యని భోజనానికి లేవమనూ" అంది, వంటింట్లోంచి.

"సరేలే అమ్మా!" అని బదులు చెప్పింది. (ఇంకా వుంది)



నాదనదిలో మునిగి తేలే గాయనిగా తార నళినీ జయవంత్. సుకేత్ చిత్రావారి "భైరవి" హిందీచిత్రంలో దృశ్యం



నూతన్ సమర్థ్

ఒకఏడాదిపాటు సినిమాలనుండి విరమించుకొని తిరిగిఇప్పుడు ఫిల్మిస్థాన్ వారి "హీర్" లో నటిస్తోంది.



సారథిచిత్రం "రోజులుమారాయి"లో పెరుమాళ్ళు, అమ్మాజీ, హేమలత, ఎ. నాగేశ్వరరావు

# బాలచిత్రాల ప్రాధాన్యం

## మద్రాసులో చలనచిత్రోత్సవం

భారతదేశంలో ప్రస్తుతం తయారవుతున్న చిత్రాలూ, ప్రదర్శింపబడుతున్న చిత్రాలూ పది పదిహేనేళ్ల బాలబాలికలు చూడడానికి యోగ్యమైనవిగా లేవని, పిల్లలకోసం ప్రత్యేకంగా చిత్రాలు తయారు చెయ్యాలనీ ఇప్పుడు సర్వత్రా ఒక భావం ప్రబలంగా వ్యాపించింది. రాజకీయ నాయకులు, ఇతర ప్రముఖులూ ఈ విషయమై ఇటీవల చాలా ప్రకటనలు చేస్తూ ప్రజలలో కొంత ఆసక్తి కలిగించారు దీని ఫలితంగా కొంతకాలంక్రితం బొంబాయి, ఢిల్లీ నగరాల్లోనూ, గతవారం మద్రాసులోనూ బాల చిత్రోత్సవాలు జరిగాయి పిల్లలకు అనువైనచిత్రాలు మనదేశంలో అట్టే లేకపోవడమువలన రష్యా, అమెరికా, బ్రిటన్, జెకోస్లోవాకియా మొదలైన దేశాల నుండి పిల్లల చిత్రాలను తెప్పించి ఈ ఉత్సవాల్లో ప్రదర్శించారు.

మద్రాసులో ఈనెల 6 వ తేదీన ఈ ఉత్సవం ప్రారంభమైంది. నగరంలోని ఆరు థియేటర్లలో సుమారు 80 చిత్రాలను వారంరోజులపాటు ప్రతి ఉదయమూ ప్రదర్శించారు. ప్రారంభదినాన న్యూఎల్ఫిన్‌స్టన్ థియేటర్లో జరిగిన సభలో మద్రాసు ఆర్థిక మంత్రి సి. సుబ్రహ్మణ్యంగారు మాట్లాడుతూ చలనచిత్రాల విషయంలో ప్రభుత్వం జోక్యం చేసుకోకతప్పదనీ, ప్రజల మనస్సులపైన, ప్రవర్తనపైన అధికప్రభావం కలిగిన సినిమాలు ఎటువంటి అవలక్షణాలూ లేకుండా పరిశుభ్రంగా ఉంటేనేతప్ప, లేకపోతే దుష్ఫలితాలు కలుగుతాయనీ, ముఖ్యంగా పిల్లలను వీటినుండి కాపాడాలని అన్నారు. పిల్లలకు అనువైన చిత్రాలు బాగా ఎక్కువగా తీయాలని ఆయన ఉద్బోధించారు.

మద్రాసులో జరిగిన బాల చిత్రోత్సవాన్ని మద్రాస్ ఫిలింఫాన్స్ సంఘంవారు ఏర్పాటు చేశారు. ఉత్సవానికి తగినంత పబ్లిసిటీ జరగకపోవడంవల్ల, సరియైన ఏర్పాట్లు చేయకపోవడంవల్ల ఈ ఉత్సవం తగినంతగా విజయం పొందలేదు. అదీగాక, విదేశాలనుండి వచ్చిన చిత్రాలన్నీ ఇంగ్లీషులో ఉండడంచేత పిల్లలకు అందుబాటులో లేకుండా పోయాయి. ఏమైనప్పటికీ ఈమాదిరి ఉత్సవాలు బాలచిత్రాలపట్ల ప్రజల్లో ఆసక్తిని, నిర్మాతలలో శ్రద్ధనూ పెంపొందించడానికి బాగా ఉపయోగిస్తాయనడంలో సందేహంలేదు. అందుచేత ఉత్సవ నిర్వాహకులైన ఫిలిమ్‌ఫాన్స్ సంఘంవారు అభినందనీయులు.

* * *

ప్రదర్శింపబడిన వాటిలో కొన్ని చక్కని

అమెరికన్, రష్యన్ కార్టూన్ చిత్రాలున్నాయి ఎమ్ జి ఎమ్ వారి "జోహాన్ మాస్" అనేకార్టూను అకాడమీ బహుమతి పొందిన చిత్రం పిల్లి ఎలుకల కథ. పిల్లి పియానో వాయిస్తుంది, ఎలుక వాల్ట్జ్ నృత్యం చేస్తుంది.

"చంద్రలోకయాత్ర" అనే రష్యన్ కార్టూనుచిత్రం పిల్లలకు విజ్ఞానదాయకంగా ఉండేట్లు తీయబడినది. గురుత్వాకర్షణశక్తి నధిగమించి భూమండలాన్ని దాటి చంద్రలోకానికి పోగల రాకెట్లను తయారు చేయడాన్ని గురించి, ఇప్పటివరకూ శాస్త్రజ్ఞులు కనుక్కున్నదాన్ని బట్టి చంద్రలోకానికి సంబంధించిన విశేషాలను గురించి పిల్లలకు సులభంగా బోధించే ఉద్దేశ్యంతో ఈచిత్రం తీయబడింది "చేగపక్" అనే మరొక కార్టూన్ చిత్రంలో పైరుపంటలను, గ్రామాలను నాశనంచేసే ఒక రాక్షసిని హతమార్చడానికి బయల్దేరిన ఒక యువకుని ధైర్యసాహసాలు, అతని అంతిమ విజయం ఇతివృత్తం. ఇది ఒక కొరియన్ జానపదకథ ఆధారంగా తీయబడినది. పంచతంత్ర కథలను పోలిన మరికొన్ని పిట్టకథల కార్టూన్ చిత్రాలుకూడా ఉత్సవంలో ప్రదర్శింప బడ్డాయి

ఈ చిత్రాలన్నీ ఇంగ్లీషులో ఉన్నప్పటికీ కథలు సులభగ్రాహ్యాలుగా ఉండడం చేత బాలప్రేక్షకులు అమితంగా ఆనందించారు. కథా నాయకుడు ఏదో అద్భుత సాహస కృత్యం చేసినప్పుడూ, తుదకు ఆఖర్లో విజయం సాధించినప్పుడూ ఆనందం పట్టలేక చప్పట్లు కొట్టారు. ఈ చిత్రాలు దేశీయ భాషల్లో నేవుంటే పిల్లలకు ఇంకెంత ఆనందదాయకాలుగా వుండేవో వేరే చెప్ప నక్కర్లేదు.

* * *

బాల చిత్రాలను తయారు చేయవలసిన అవసరాన్ని మనదేశంలో ఇప్పుడిప్పుడు గ్రహిస్తున్నారు. అమెరికా, బ్రిటన్ మొదలైన పాశ్చాత్య దేశాల్లో నిర్మాతలు వయోజనులకోసం నిర్మించే చిత్రాలతోపాటు పిల్లలకోసం వైజ్ఞానిక చిత్రాలు, వినోదకరములైనకార్టూన్‌చిత్రాలు చాలాయేళ్లుగా తయారు చేస్తున్నారు. అమెరికాలో వాల్ట్‌డిస్నీ మొదలైనవారు, బ్రిటన్‌లో ఆర్థర్ రాంక్ సంస్థవారు చాలా చిత్రాలు తయారు చేశారు అయితే ఈ చిత్రాలు వయోజనుల చిత్రాలతో వ్యాపార రీత్యా పోటీచేయలేకపోవడం మూలాన అవి నిర్మాతలకు అంత లాభసాటిగా కనబడడంలేదు. ఈకారణాన అవి ఆ దేశాల్లో అంతగా అభివృద్ధి కావడంలేదు. రష్యా, జెకొస్లోవాకియా మొదలైన దేశాల్లో ప్రభుత్వాలే ఈవిషయంలో శ్రద్ధవహించి అనేక బాల చిత్రాలు నిర్మిస్తూ, బాల ప్రేక్షకులకు వినోద విజ్ఞానాలిచ్చే బాధ్యతను స్వీకరించి పనిచేస్తున్నాయి ఆదేశాల్లో బాల చిత్రాల నిర్మాణం బాగా ప్రోత్సహింప బడుతున్నది.

ఇటీవల మనదేశంలోకూడా బాలచిత్ర నిర్మాణం పైన్రివేటు నిర్మాతలకు వదిలిపెట్టి వూరుకోవడంకంటే స్వయంగా ఏదైనా చేయడం మంచిదని భారతప్రభుత్వం కొంతశ్రద్ధ వహించింది. తత్ఫలితంగా బాలచిత్ర సంఘం ఒకటి స్థాపింప బడింది. ఈ సంఘం [illegible] [illegible] హ్రాదయ



ఫిల్మిస్థాన్‌వారి "జాగృతి"లో రాజ్‌కుమార్, ముంతాజ్ బేగం



వాహినిచిత్రం "బంగారుపాప"లో రామశర్మ, విద్య, జగ్గయ్య, శివరామకృష్ణయ్య

# వాస్తవిక చిత్రాలు నిర్మించాలి

## నిర్మాతలకు వి. కె. కృష్ణమీనన్ హితవు

ఈనాటి సాంఘిక యథార్థాన్ని ప్రతిబింబించే వాస్తవిక చిత్రాలు నిర్మించాలనీ, కళాకారులు నాలుగుగోడల మధ్యనే నివసిస్తూ ఏకాంతాన్ని ఉపాసిస్తూ కళాసృష్టి సాగించలేరనీ శ్రీ వి. కె. కృష్ణమీనన్ ఈనెల 4 వ తేదీన ఢిల్లీ చలనచిత్ర గోష్ఠిలో ఉద్ఘాటించారు. గోష్ఠి ఆనాటితో సమాప్తమైంది.

ఫిలిం పరిశ్రమలో ప్రముఖులైన అనేకులు ఈ గోష్ఠిలో పాల్గొని, తమ వ్యక్తిగతాభిప్రాయాలను బాహాటంగా వెల్లడించారు. దీనివల్ల అతి ప్రధానమైన అనేక అంశాలు వెల్లడైనవి. ఫిలిం పరిశ్రమకు సంబంధించిన సాధకబాధకాలు ప్రజలకూ, ప్రభుత్వానికీ తెలియబరచడానికి ఈ గోష్ఠి చక్కని అవకాశం ఇచ్చింది.

కృష్ణమీనన్‌గారు ప్రత్యేకాహ్వానం మీద గోష్ఠిలో పాల్గొన్నారు. మరొక అయిదేళ్ళలో భారతదేశం యావత్తూ కమ్యూనిటీ ప్రాజెక్టులతో నిండిపోతుందనీ, ఈ ప్రాజెక్టులు చేసేపని గ్రామీణ ప్రజలకు తెలియజేయడానికి సినిమాలు ఎంతైనా ఉపయోగపడతాయనీ ఆయన అన్నారు. "మన దేశం ఆర్థికంగా స్వయంపోషకమైనవాడు, ఫిలిం పరిశ్రమకూడా దానంతటఅదే అభివృద్ధి కాగలదు. ముందు కడుపు నిండితేనే కళ అయినా, సంస్కృతి అయినా," అన్నారాయన పిల్లల చిత్రాలనుగూర్చి ప్రధాని నెహ్రూ చేసిన విజ్ఞప్తిని ఆయన బలపరిచారు వినోదం పన్నుగూర్చి చెబుతూ, ప్రపంచంలో ఏ ప్రభుత్వమూ పన్నులు రద్దుచేయదని, పన్నులు లేనిదే పనులు జరగవనీ అన్నారు.

అంతకుముందు రోజుల్లో జరిగిన సభల్లో పలువురు పలువిషయాలపై ఉపన్యాస పత్రాలు చదవడం, వాటిపై యితరులు చర్చలు చేయడం జరిగింది.

"ఇండియాలో ఫిలిం పరికరాలను తయారుచేయడంలో గల టెక్నికల్ సమస్యలు, ఆర్థిక సమస్యలు" అనే విషయమై అక్బర్ ఫజల్‌భాయ్ ఉపన్యసిస్తూ, చిత్రనిర్మాణానికి, ప్రదర్శనానికి అవసరమైన సాధనసామగ్రిని దేశంలోనే తయారుచేసుకోవలసిన సమయం ఆసన్నమైందనీ, స్వల్పంగానైనా ప్రారంభించి కాలక్రమేణా ఉత్పత్తిని అధికం చేయాలనీ సూచించారు. సామగ్రిని దిగుమతి చేసుకోవడంవల్ల ఇప్పుడు మనం యితరులపై

---

### బాలచిత్రాల ప్రాధాన్యం

శాఖకుంజ్రూ ఇటీవల ఢిల్లీ ఫిలింగోష్ఠిలో మాట్లాడుతూ, ప్రభుత్వసహాయంతో ఈ సంఘంవారు బాల చిత్రాలను తయారుచేయడానికి నిశ్చయించారనీ, ప్రైవేటు నిర్మాతలు కూడా వాటిని తయారుచేయాలనీ అన్నారు. ప్రైవేటు నిర్మాతలకు కూడా ప్రభుత్వం సహాయం చెయ్యాలని ఆయన కోరారు

కార్టూన్ చిత్రాలు నిర్మించేందుకు ఫిలిమ్స్ డివిజన్‌వారు సంకల్పించారనీ, భారతీయ చిత్రకారులకు కార్టూన్ చిత్రనిర్మాణంలో తర్ఫీదు ఇవ్వడానికి వాల్ట్ డిస్నీ స్టూడియోస్ నుండి ఒక నిపుణుని పిలిపిస్తారనీ తెలుస్తున్నది. ★

ఆధారపడవలసి వుండడమేకాక, ఆర్థికంగా కూడా నష్టపడుతున్నామనీ ఆయన అన్నారు

ఈ నెల 2 వ తేదీన జరిగినసభలో చలన చిత్ర ఛాయాగ్రహణం, భారత శాస్త్రీయ జానపద సంగీత సంపద, దానికి చిత్రాలలో గల స్థానం, భారతీయ కవులు, చిత్రాల్లో పాటలకు గల స్థానం అనే విషయాలపై ఉపన్యాస పత్రాలు సమర్పించబడ్డాయి.

8 వ తేదీ సభలో మద్రాసు ప్రతినిధి ఆర్. ఎమ్. శేషాద్రిగారు చిత్రాలను మార్కెట్ చేయడంలో గల యిబ్బందులను వివరించి, వాటిని తొలగించడానికి కొన్ని మార్గాలు సూచించారు. లైసెన్సింగ్ నిబంధనలను సడలించడం వాటిలో ఒకటిగా ఆయన పేర్కొన్నారు వినోదంపన్ను గూర్చి చెబుతూ ఇలా అన్నారు. "ఈ పన్ను అన్ని దేశాల్లోనూ విధింపబడుతూనే వున్నదన్న మాట నిజమే. కాని ఇతర దేశాల్లో ప్రభుత్వాలు ఈ పన్నుపై వచ్చే రాబడిలో ఎక్కువభాగాన్ని చిత్రనిర్మాతలకు ఆర్థికసహాయం చేయడానికే వినియోగిస్తున్నారు. మనదేశంలో అలా కాదు. వినోదం పన్ను రాబడిలో ఒక్క చిల్లిగవ్వ కూడా ఫిలిం పరిశ్రమ సహాయానికి ఇవ్వబడడంలేదు. మరొక తేడా వున్నది. మన దేశంల్లో ప్రదర్శింపబడే చిత్రాల్లో నూటికి పదివంతులు తప్ప మిగతావన్నీ మన చిత్రాలే. అంటే వినోదం పన్ను ఎక్కువగా మన చిత్రాలపైనే వసూలు చేయబడుతోందన్నమాట. కాని యూరపియన్ దేశాల్లో ప్రదర్శింపబడే చిత్రాల్లో చాల మటుకు విదేశీ చిత్రాలుంటాయి. అందుచేత వినోదంపన్ను విదేశీ చిత్రాలకే తప్ప స్వదేశీ చిత్రాలకు తగలడంలేదు. ఆ దేశాల్లో విదేశీ చిత్రాలమీద పన్ను వసూలుచేసి స్వదేశీ పరిశ్రమకు సహాయం చేస్తారు. మన దేశంలో సహాయం లేకపోగా పన్నుల బాధకూడా తగులుతోంది."

## బి. ఎన్. రెడ్డి

నిర్మాత, దర్శకుడు శ్రీ. బి. ఎన్. రెడ్డిగారు మాట్లాడుతూ నటీనటులు, టెక్నిషియన్లు ఒకేసారి అనేక చిత్రాలలో పని చేయడంవల్ల వీరిపై ప్రజల మోజు తగ్గిపోయి బాక్సాఫీస్ నష్టపడుతోందని అన్నారు.

ప్రస్తుతం మన దేశానికి జాతీయ సారస్వతం లేదనీ, అందుచేత యువక రచయితలను ప్రోత్సహించాలనీ నటుడు దిలీప్ కుమార్ అన్నారు. దీనిని సమర్థిస్తూ నటుడు డేవిడ్ "గడచిన పదేళ్లలో చిత్రాలను నిర్మించడం కాక పునర్నిర్మించడమే ఎక్కువగా జరుగుతోంది. దీనికి కొత్త రచయితలను ప్రోత్సహించక పోవడమే కారణం," అన్నారు. ఫిలిం పరిశ్రమపై ఒకే ప్రభుత్వశాఖకు గాక అనేక శాఖలకూ, మంత్రులకూ అధికారం ఉండడంవల్ల యిబ్బంది కలుగుతోందని రచయిత అబ్బాస్ అన్నారు.

## సినిమాల్లో సంగీతం

సినిమాల్లో సంగీతానికి ఉన్నస్థానం ఏమిటనే విషయమై చర్చ జరిగిన సందర్భంలో వాసన్‌గారు సినిమాల్లో కొన్ని పాటలు విధిగా ఉండాలిసిందే నన్నారు. అబ్బాస్ మాట్లాడుతూ, కథలో పాటల అవసరం లేనట్లయితే పాటలు పెట్టగూడదనీ, బాక్సాఫీస్ కోసమని పాటలు పెట్టడం అనుచితమనీ వాదించారు.

మనదేశంలో వివిధములైన సంగీతవాద్యాలుండగా విదేశీయ వాద్య సంగీతాన్ని ప్రవేశపెట్టడం బాగాలేదని నర్తకుడు ఉదయశంకర్ విమర్శించారు. దీనికి సమాధానమిస్తూ నటుడు రాజ్ కపూర్ "మనం, ఇంగ్లీషు వేషాన్ని, భాషనూ స్వీకరించాం. అదేవిధంగా కొన్ని చిత్రాల్లో అవసరమైనప్పుడు నిర్మాతలు విదేశీ వాద్య సంగీతం ప్రవేశపెడతారు. తప్పేముంది?" అని ప్రశ్నించారు.

"భారతీయ సాంస్కృతిక సాంఘిక జీవనంలో ఫిలింనటుల స్థానం" అనే విషయమై నటి దుర్గాఖోటే ఉపన్యసిస్తూ వివిధప్రజాహిత కార్యాలకు నిధులు ప్రోగుచేయడంలో ఫిలిం నటీనటులు గొప్ప కృషి చేస్తున్నారన్నది.

చవకబారు చిత్రాల్లో నటీనటులు పాల్గొనగూడదనీ, ప్రజలపై దుష్ప్రభావం కలిగిన పాత్రలను నటులు తిరస్కరించాలనీ,



ఫిలింగోష్ఠి ప్రతినిధులు ఫిబ్రవరి 27 వ తేదిన రాష్ట్రపతి భవనంలో డాక్టరు రాజేంద్రప్రసాద్‌ను కలిసినప్పటి చిత్రం.



ఎస్. రాజావారి హిందీ (అగ్గిరాముడు) "ఆజాద్"లో మీనాకుమారి, అచలాసచ్ దేవ్

దేశానికి ఓపిన సేవ చేయాలని నటి ఎర్లీన్ అన్నది.

నటులకు తర్ఫీదు ఇచ్చే ఎకాడమీలను స్థాపించాలని బెంగాలీ నటుడు అహీన్ చౌధురి, సంగీత నాటక అకాడమీలో ఫిలిం నటులకు స్థానం ఇవ్వాలని రాజ్ కపూర్ అన్నారు.

"స్టార్ సిస్టమ్" ను విమర్శిస్తూ అబ్బాస్ అనేక చిత్రాల్లో ఒకేసారి పనిచేసే నటులను బుక్ చేయరాదని నిర్మాతలను కోరారు.

మన దేశంలో విదేశీయ చిత్రాల ప్రదర్శనం, డిస్ట్రిబ్యూషన్ ఏ పద్ధతుల్లో జరుగుతోందీ జె. ఎమ్. మోడీ వివరించారు. ఆయన ఉపన్యాసంపై చర్చ ప్రారంభిస్తూ బాబురావ్ పాయ్, విదేశీయ చిత్రాలను మన దేశంలో ప్రదర్శింప నిచ్చినందుకుగాను మన చిత్రాలను విదేశాల్లో ప్రదర్శించి తీరాలని 'కోటా' నిబంధనలను ప్రవేశపెట్టాలని ప్రభుత్వాన్ని కోరారు.

"చిత్రంలో మంచి కథకు గల ప్రాముఖ్యం" అనే విషయమై ఉపన్యాస పత్రం సమర్పిస్తూ రచయిత అబ్బాస్, ప్రయోజనవంతమైన చిత్రాలు తీయాలంటే నిర్మాతలకు ప్రభుత్వం కేవలం బహుమతి పతకాలను కాకుండా, ధనం రూపేణా సహాయం చేయాలనీ, చలనచిత్రాలకు పనికి వచ్చే ఉత్తమ కథలకుగాని, నవలలకుగాని ఏటేటా బహుమతు లివ్వాలనీ, కథారచయితలు దేశమంతా తిరిగి కథకు కావలసిన సమాచారాన్ని సేకరించేందుకుగాను ప్రభుత్వం సౌకర్యాలు కలిగించాలనీ కోరారు.

"ఫిలిం లాబొరేటరీ" అనే విషయంపై మద్రాస్ ప్రతినిధి ఎస్. సి. సేన్ గుప్త సమర్పించిన పత్రంపై రాజ్ కపూర్ చర్చ ప్రారంభిస్తూ చిత్రాల డిస్ట్రిబ్యూషన్ను, ప్రదర్శనాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకొని పరిశ్రమకు కలుగుతున్న ధననష్టాన్ని నివారించాలని కోరారు.

"చిత్రాలలో నృత్యానికి గల స్థానం" అనే విషయంపై ఉదయశంకర్ ఉపన్యాస పత్రం సమర్పిస్తూ, సినిమాలో నాట్యాలను ప్రవేశపెట్టడం ఎక్కువౌతున్న కొద్దీ మన శాస్త్రీయ నృత్యపద్ధతికి హాని ఎక్కువైపోతోందనీ, కాలక్రమేణా శాస్త్రీయనృత్యం రూపు మాసిపోగలదనీ హెచ్చరించారు.

చివరి తేది సాయంత్రం సంగీత నాటక అకాడమీవారు ఫిలిం ప్రతినిధులకు విందు చేశారు. అకాడమీ అధ్యక్షుడు రాజమన్నార్ గారు చర్చలలో స్నేహభావంతో పాల్గొన్న ప్రతినిధులను అభినందించారు. ప్రతినిధుల తరఫున శ్రీమతి దుర్గాఖోటే కృతజ్ఞత తెలియజేసింది. ★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras

